# ఆంధ్రజ్యోతి.

ఆంధ్రరాష్ట్రప్రబోధకనాటకము.



రచయిత:

గుళ్లపల్లి నారాయణమూర్తి L.M.S.

(నవ్యసాహిత్య పరిషత్తు)

వెల రు 0-10-0 కాపీరైటు రిజిష్టరుబడు పోస్టు ఖర్చులు వేరు.

# మనవి

సాహిత్యం ప్రబోధసాధనంగా ఉపకరించింది చాలా దేశాలల్లో. ముఖ్యంగా రష్యాలో విప్లవదినాలల్లో ఎంతో సాహిత్యం పుట్టింది. జర్మనీ ఇటలీల కష్టదినాలలో ప్రజా హృదయాన్ని చూరగొన్నది సాహిత్యం. ఇంగ్లాండులో బెర్నార్డ్‌షా, గాల్స్‌వర్దీల నాటకాలు, ఇబ్సెన్ నాటకాల అనువాదాలు, ప్రజాజీవితంమీద గొప్పప్రభావం చూపించాయి.

ప్రబోధ నాటకాలలో కళ సన్నగిలిపోతుందని కొందరి మతం. ఇబ్సెన్ నాటకాలల్లో కళ పరిమితంగానే ఉంది. బెర్నార్డుషా నాటకాలు ఉపన్యాసవేదికమీదనుండి వచ్చే నీతిబోధకములగు ఉపన్యాసాలుగానే ఉన్నాయి.

అయితే.........

ప్రస్తుత ఆంధ్రజాతిలోవలె వ్యక్తివాదంనశించి, ప్రజలలో ఒకసామాన్య తృష్ణబలీయమయినప్పుడు అది సాహిత్యంలో ప్రతిబింబించడం ధర్మం—మీదను తేలిపోయే మేఘాలు దిగువనున్న సరస్సులో ప్రతిఫలించినట్లు— అప్పుడు కళాసౌందర్యం పూర్తిగా చిత్రితమయిందా లేదా అనేది ప్రశ్న కాదు. నిత్యపరిచలనంతో సాగిపోతూన్న ఈనూతన ప్రపంచంలో (New world order) మానవాభ్యుదయానికి ఆసాహిత్యకళలం ఎంతవరకు సహాయపడినద నేదే లెక్కకువస్తుంది. ఆపరిస్థితులలో కళ తన ఉన్నతాసనంనుండి దిగి, భోజనం చెయ్యడం, మంచినీళ్లు తాగడంలాగే మానవుని సాధారణ జీవితచర్యలో కలిసిపోతుంది. దానినుండి తప్పించుకోడానికిగాని దానిమార్గం తప్పించడానికిగాని ఏవ్యక్తికీసాధ్యంకాదు.

ఈనాటక రచనకోసం శ్రీయుతులు మల్యాల వెంకట శివరామకృష్ణగారు, భావరాజు కృష్ణారావుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు మొదలగువారి వ్యాసాలు, రచనలు చదివి, తరచి, కావలసినసామగ్రిసేకరించాను. ఆంధ్రోద్యమ ప్రబోధకములగు రసవత్తమములయిన రత్నాలవంటి పద్యాలను వ్రాసి విడిచిపెట్టారు ఆంధ్రలోకంలో, నవ్యాంధ్రమహాకవులు. వాటిలో కొన్నింటి నేరుకొని, ఏతద్రచయితల కృపాపూర్వకమయిన అనుమతులు పొంది ఈనాటకంలో స్వేచ్ఛగా వాడుకొన్నాను.

ఈనాటకాన్ని గుంటూరు 21న ఆంధ్రమహాసభలోను, ఏలూరు18వ ఆంధ్రరాష్ట్రీయసభాసమయమందు, కాకినాడలో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవంలోనూ ఇంకా ఇతర స్థలాల్లోను ఇప్పటికి తొమ్మిదిసార్లు, మహామహులయిన రాజకీయవేత్తలు, పండితులు, కవులు, నటకులు, విమర్శకుల కేకాక సర్వజనామోదకరంగా ప్రదర్శించి ప్రచారానికి తోడ్పడిన మాఅనకాపల్లి అమెచ్యూర్ నటమండలిసభ్యులకునాకృతజ్ఞత.

కర్మవీరాగ్రణి శ్రీ వరహాగిరి వెంకటగిరిగారు ఈనాటకకృతి గ్రహించడాని కంగీకరించడం నాభాగ్యం.

ఎన్నో నాటకాలు రచించి, నాటకసమాజాలు స్థాపించి ప్రదర్శనాలు జరిపించి,మావిశాఖపట్నంజిల్లాలో ఆంధ్రనాటకరంగానికి పునాదివేసిన పూజ్యులు పండిత మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు నాకోరికమన్నించి సవిమర్శకంగా చక్కని తొలిపలుకు వ్రాసియిచ్చినందుకు చాలాకృతజ్ఞడను.

అనకాపల్లి,<br>1—4—40.

రచయిత

# తొలిపలుకు



"ఆంధ్రజ్యోతి" డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు (అనకాపల్లి) వ్రాసిన రసవంతమగు క్రొత్తనాటకము. ఇందు కొంత డాక్టరుగారు చదువఁగా మొదటవింటిని. అంతయు అనకాపల్లిలో "అమెచ్యూర్ నటమండలి"వారు ప్రదర్శింపఁగా తరువాత చూచితిని. అంతయు, పిమ్మట చదివితిని. అందువలన నాడెందమలరినది. ఉత్సాహమును సంతోషమును కలిగినవి.

నాటకాభిలాషిని, ఆంధ్రాభిలాషినికాన, నాటకకర్తగారు నాయభిప్రాయమును కోరిరి. నేను వ్రాసితిని. కాని, మాయిరువురకున్న తొందర పనులవలన అది ఇంతవఱకును పైకిరాలేదు. ఇప్పటికి ఈనాటకము తొమ్మిదిసార్లు ప్రదర్శించినారఁట. అందుచే, ఇపుడు అచ్చొత్తింపనెంచి, కృష్ణాపత్రికలో మొదట ప్రకటింపదలచిన నాయభిప్రాయము తొలిపలుకుగా మార్పకోరిరి. దానికి సంతోషపూర్వకముగా ఈయకొంటిని.

క్రొత్త ఒకవింత; ప్రాఁతఒకరోఁత—అనికదాసామెత. కాని, నాకు క్రొత్తయెల్ల వింతయునుకాదు; ప్రాఁతయెల్ల రోఁతయునుకాదు. మార్పు ఉసుఱుపసకు గుర్తు; క్రొత్తమార్పునకుగుర్తు; మార్పు తఱితో రాక మానదు. అయినను మార్పెల్ల మంచిదే అనరాదు. తక్కినవానితోపాటు నాటకములుకూడ మాఱవలసినవే. ఒక్క అచ్చులోనే నాటకములన్నియు తీయవలయుననుమాట మొదటనే నాకు గిట్టకపోయె. అందుచే ప్రాఁత నాటకలక్షణమునే గుఱిగా కైకొన నక్కఱలేదను తలంపుతోడనే పెక్కు నాటకములు వ్రాసితిని. కాన, ఈనాటకమందలి క్రొత్తఁదనము మొత్తము మీఁద నాకు నచ్చినదే. అది దేశాభివృద్ధికొఱకు చాలవఱకు కావలసినదే.

### సాంఘికమా ? రాజకీయమా ?

మొదట నాటకకర్తయు, పిదప మఱికొందఱును, ఆంధ్రజ్యోతిని సాంఘికనాటకమే అనినారు. కాని; నాతలంపువేఱు. ఇందుసంఘసంస్కరణ

విషయము కొంతే ఉండుటచే ఇది వారు సాంఘికమనిరి. కాని, ఇందలి కథకు మొదలేని తుదియేని సాంఘికముకాదు. ఇది వ్రాయుతలంచే సాంఘికముకాదు. అయిన మఱియేమి? గ్రామపునర్నిర్మాణముతో కూడిన ఆంధ్రరాష్ట్రసంపాదనమందు ఆంధ్రులకందఱకును మహోత్సాహము కలిగించుటయే. కాన, దీనిని రాజకీయనాటకముగానే పాటింపనగును. అసలు నాటక కథయే బాగుగా అరసిచూతము :—

ఉపక్రమణిక :—

ఇది, మునుపటి ఆంధ్రవైభవ వర్ణనముతో ఒప్పి అప్పటి మహావేశ మర్థించి, అక్షరులు చల్ల ఆంధ్రులను హెచ్చరించుటకు, కర్మవీరుఁడు చదువు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి పద్యరత్నము. ఇది కోరిన మహావేశము చూపఁజాకు కలిగించి రాష్ట్రసంపాదన దీక్షవూన వారిని ఆకర్షించును! ప్రోత్సహించును!! ఎంతచక్కని యెత్తుబడి! ఇది రాజకీయ కథాబీజము కాక, సాంఘిక కథాబీజమెట్లు కాఁగలదు? ఈతీయ మామిడివిత్తనము ఎట్లు మొలకెత్తి పెంపొందినదో అరయుదము.

రెండవరంగము:—

ఇందు కర్మవీరుఁడు చేసిన ఆంధ్రమాతృస్తుతియు, ఆంధ్రుల స్వాతంత్ర్యముపోయి వారి పౌరుషజాతీయతలు అడుగంటినందుకు మిగులవగచుచు అతఁడు కార్చిన కన్నీటిజాలును, వాసుదేవరావునకు అతఁడుచేసిన బోధనలును పైరాచకతవిత్తనమును మొలకెత్తింప పోసిన నీటిపోఁతలు.

నాలుగవరంగము:—

ఇందు దొంగకాంగ్రెసువాది కృష్ణారావు హరిజనుఁడగు అప్పన్నను నిరసించి, కొట్టునట్లుచేయుట రాచకత మొక్కకుపట్టిన చీడనుకనుఁగొనుట.

ఐదవరంగము:—

ఇందు వాసుదేవరావును రైతులును ఆంధ్రాభిమానమును బోధించుచు, పాడుపాట రాచమామిడిమొక్క గాడుపుదెబ్బలకు లోనుగాక

సరిగా నిలచియుండుటకు పాతిన గట్టి ఆనుకొయ్య !

"తల్లి వెన్నె ముక ఆపల్లెటూరేసుడీ"—ఇది, ఉన్నది ఊడఁగొట్టు కొని ఏవో నాలుగింగ్లీషుముక్కలు చదువుకొని, ఏపనియు దొరకక, "ఏమి గతి" అని ఏమియుతోచక అల్లాడుచు వనటపాలగు మన ప్రియపు సోదరులు జపింపఁదగుమంత్రము ! దానివలన తాము రైతులలో రైతులై, తల్లి వెన్నెముకకు మఱింత సత్తువ తెచ్చి, హాయిగా బ్రతుకుచు, స్వతంత్రులై ఆంధ్రరాష్ట్ర సంపాదనమునకు వలంతులగుదురుగాక !

ఆఱవరంగము:—

ఇందువాసుదేవరావునకు, కృష్ణారావుతోను, వసంతతోను జరిగిన సంభాషణములు, చీడపోఁగొట్టుటకు చల్లిన మేటిమందులు!

ఏడవరంగము:—

ఇందు రామం దెబ్బలుతిన్న అప్పన్నకు సాయముచేయుట చాల అవసరమని చెప్ప వాసుదేవరావు దానికీయకొనుట పైమావిగున్న బాగుగా పెరుఁగుటకు వేసిన మంచిగెత్తము !

ఎనిమిదవరంగము:—

ఇందు కర్మవీరుఁడుచేసిన ప్రబోధము ఆగున్నమామిడి, చక్కగా పూచి, కాచుటకు చేసిన విద్యుచ్ఛక్తి ప్రయోగము!

తొమ్మిదవరంగము:—

ఇందు వాసుదేవరావు అప్పన్నయెడల చూపిన ఆదరణ రసము మావిగున్నపూచుటకు తోడ్పడిన మేలి దోహదము !

పదునొకండవరంగము :—

ఇందు కర్మవీరుఁడు కావించిన ప్రబోధము, పడినపిందెలు నిలుచుటకు పనికివచ్చు అదను వానసోన !

పదమూడవరంగము:—

ఇందలి రైతుల మెప్పులు తొలిపంటపండ్లు !

పదునాలుగవరంగము:—

ఇందు గ్రామం, కృష్ణారావు కపటనాటకమును ఖండించుట వెంకమ్మ పుష్పిమందు!

పదునేనవరంగము:—

ఇందలి కర్మవీరుని ప్రబోధము పంటను పూర్తిగా నిలుపు కాపుదల!

పదునారవరంగము:—

ఇందు గ్రామం ఆంధ్రరాష్ట్రమునుగూర్చి తెలిపినమాటలు, విష వాయువును విడఁగొట్టి ప్రాణవాయువు సమకూర్పఁ జాలు దండి యెండలు!

పదునేడవరంగము:—

ఇందు వాసుదేవరావు చేసిన స్వార్థత్యాగము, రాచకత మావిగున్న రెండవ కాపుకోఁతకు కావించిన గెత్తపుపోఁత!

పదునెనిమిదవరంగము:—

ఇందలి కర్మవీరుని ప్రబోధము దానిపెంపునకు సాయపడు చక్కని వాన!

పందొమ్మిదవరంగము:—

ఇందు జానకి పాటయు రామమును వాసుదేవరావును ఆమె ప్రవర్తనమునకు మెచ్చుకొనుటయు, వాసుదేవరావు నాగిరెడ్డిని మంచిదారి లోనికి తెచ్చుటకు కడంగి, తోడ్పడుటయు, మావిగున్న పెంపునకు త్రవ్విన మంచిగోవ్వులు!

ఇరువదవరంగము:—

ఇందు వాసుదేవరావు వసంతను గోపాలము బారినుండి తప్పించుటలో చూపిన వీరము దానిచుట్టును దున్నినలోతుదుక్కి!

ఇరువదొకటవరంగము:—

ఇందు వసంత ఆంధ్ర వారపత్రికలోనిద్ధని చదివిన వాసుదేవరావు ప్రశంస మావిగున్నపూచిన రెండవ నిండుపూఁత. ఆమెనడతలో కలిగిన మార్పు ఆపూఁతకాపు!!

ఇరువది రెండవరంగము:—

ఇందు పశ్చాత్తాపమొంది, గ్రామసేవకు తనజీవిత మర్పింప నిశ్చయించి, వాసుదేవరావునేకాక, రాముమును సైతము తన్ను క్షమింప వసంత వేడుకొనుటయు. వాసుదేవరావు ఆమెను తన యిల్లాలుగా కైకొన ఇయ్యకొని, ఆమెతోడను, పశ్చాత్తాపపడి తన్ను క్షమింపవేడిన కృష్ణారావు తోడను, తనగుణము సరిగా గుర్తించిన తండ్రితోడను, తక్కినవారితోడను కూడి ఆంధ్రమాతను స్తవము చేయుటయు, కర్మవీరుఁడు తానుచేసిన ప్రబోధము ఫలించు ఆశ కనఁబడఁగా ఆనందించి, వాసుదేవరావును అభినందించుటయు ఆంధ్రరాష్ట్రము త్వరలో ప్రాప్తమగునుగాక! అను భరతవాక్యమును, రాచకేత మావిగున్న రెండవమేటిపంట విందారగింపులు ! !

ఇట్లు ఉపక్రమణికలోనే ప్రారంభమై, సిదప పదునాలుగురంగములలో వచ్చి, ప్రాధాన్యముపొంది, నాటకకథ తుదకు రాజకీయముగానే ముగిసినది.

అయినను, ఈనాటకమున సాంఘిక కథకూడ అరసి, దాని ప్రాధాన్యము రాజకీయ కథకున్న ప్రాధాన్యముకంటె తక్కువఅని. తేల్చిననే కాని ఆంధ్రజ్యోతి రాజకీయమే అనరాదు కాన, సాంఘిక కథయు బాగుగా అరయవలయు. ఇది అంతయు ఒకేభాగముకాదు. ఇందు విభాగములుగలవు. ౧ వివాహము. ౨ హరిజనోద్ధరణము. 3 వేశ్యాదురాచారము. ౪ మిత్రద్రోహము. ౫ స్వామిద్రోహము. ఇందువలన సాంఘికకథకు రాజకీయకథకున్నంత ప్రాధాన్యము లేకపోవుట తటస్థించినది. ఈవిభాగములలో ముఖ్యమైనది.

౧. వివాహము:—

మొదటిరంగములో, వయస్సుమీఱినను పెండ్లిలేక, వైద్యవృత్తి ప్రారంభించి, తనప్రియునికొఱకు ముస్తాబైన వసంతయు, ఆమెతో చిన్ననాఁటినుండియు నేస్తముగాఉండి, వ్యవసాయపరీక్షయిచ్చి, ఆమెయు తానును అమెరికాకువెళ్ళి తమ అభిమానవిద్యలలో పెద్దపట్టములు పొందతలంచు వాసుదేవరావును, మాటలాడుచు ఒండొరులవలపు వెలువఱించుట వైవా

హిక కథాబీజము; ఇది చిరపరిచయజలసేచనముచే మొలకెత్తియే ఉన్నది. ఇందు రాజకీయ కథయు కొంతకలదు.

ఆఱవరంగములో వసంతా వాసుదేవరావుల ఆదర్శభేదము బయలుపడుటవలన పెండ్లికతతీఁగకు వడదెబ్బ తగిలినది.

తొమ్మిదవరంగములోని వసంత నడత దానికి వఱపయినది.

పదమూడవరంగములో జానకియెడ వసంతచూపిన అనాదరణము మఱొక వడదెబ్బ అయినది.

పదునాలుగవరంగములో వలపుచెమ్మ ఇంకుటచే కతతీవ్వ వాడినది.

పదునాఱవ రంగములో వసంతయెక్కు వేఁడిమిచే అది ఎండఁబాఱినది.

ఇరువదవరంగములో వాసుదేవరావు వసంతను గోపాలము బారినుండి తప్పించుట, ఎండఁబాఱినతీఁగకు అమృతపువానసోన అయినది.

ఇరువదొకటవరంగములో వాసుదేవరావుప్రశంసావర్షముతో కతతీవమరల కలకలలాడినది.

ఇరువదిరెండవరంగంలో వసంతనడత మార్పు కథాలతకు వసంతమైనది.

ఇట్లు సాంఘికకథాభాగములో ముఖ్యవిభాగమగు పెండ్లికతతీవ మొలకెత్తియు, వడదెబ్బ వఱపుదెబ్బలకులోనై, వాడి, ఎండుబాఱి, తుదకెట్లో దైవికముగా తేఱుకొనినది; అదియు రాజకీయకథావృక్షపు ప్రాపుననే. కాన, దీనికి రాజకీయకథకంటె హెచ్చుప్రాధాన్యము కలదనవీలు లేదు. ఇది పట్టితోడే.

౨. హరిజనోద్ధరణము:— ఇదికేవలము రాజకీయకథకుతోడే కాన, దీనికి సాంఘికముగా ప్రాధాన్యములేదని వేఱేచెప్పనక్కఱయేలేదు.

౩. వేశ్యాదురాచారము:— యిది ప్రదర్శించుటకే కాని పూర్తిగా నివారించుటకు తెచ్చినదికాదు. నివారణము ఒక జానకికే పనికి

వచ్చినది. అదియు రాజకీయకథను తోడ్పడుటకే. కాన దీనికిని, సాంఘిక ముగా ప్రాధాన్యము నున్నదే.

౪ మిత్రద్రోహము:- ఇది కృష్ణారావు తనకూఁతురును 'వాసు' పెండ్లి యాడ ననుటచే తండ్రి ఆస్తి వానికి దక్కకుండఁ జేయుటకు స్వామిద్రోహి అగు గోపాలముతో కలసిచేసిన కుట్రరూపునను, వసంత తన్ను విడనాడిన వాసుదేవరావుపై పగసాధింపఁజూచిన తలంపుగాను పొడచూపినను, తుదకు ఫలింపకపోవుటయేకాక, వారిరువురు పశ్చాత్తాపమొంది, వాసుదేవరావునే తమ్ము క్షమింపవేఁడుకొనుటచే దీనికి ప్రాధాన్యము లేనేలేదు.

౫. స్వామిద్రోహము:—— దీనికి గోపాలము కృష్ణారావుతో కలసి కడంగినను, ఆకడంకలో తాను విఫలుఁడగుటయేకాక, ఖైదులోకూడ పడవలసివచ్చుటచే ప్రాధాన్య మబ్బుటకు రవంతయు వీలులేదు.

ఇట్లు సాంఘికకథ రాజకీయకథకంటె ప్రాధాన్యము చాలతక్కువ కలదని తేలుటచే ఈ నాటకము రాజకీయమే అనుటకు మఱి సందేహ మేమి ? వేయిఏల ? ఆంధ్రజ్యోతి మేలితరగతి రాజకీయ నాటకమని పాటింపదగినదే. నిజమునకు పేరే నాటకము రాజకీయమని చాటుచున్నదికదా! అందుచేతనే ఒకమంత్రికి ఇది అంకితమయ్యె.

మఱొక విశేషము! ఈనాటకము ఆంధ్రోద్యమమును ప్రోత్సహించి, ఆంధ్రరాష్ట్రము గ్రామపునర్నిర్మాణముతో సాధింపఁదగునని బోధించుటయేకాక, అది కాంగ్రెసు మహాసంస్థసాయమున రావలసియుండుటచే, మహాత్ముఁడు కోరినట్లు దానిని మొదట సంస్కరింపవలయునని దాని లోపములువెల్లడించి, అట్టిలోపములుచేసినవాఁడు పశ్చాత్తప్తుఁడగునట్లుచేసి, కాంగ్రెసు ప్రతిష్ఠ నిలిపినది. దీనితో ఇది నిండుగా రాజకీయమయినది.

## పాత్రపోషణము

పాత్రపోషణము నాటకమునకు ప్రశస్త భూషణము; అది ఇందు సరిగానే జరిగినదనఁదగును.

కర్మవీరుఁడు తొలుత ఆంధ్రవైభవనాశనమునకు విలపించుచు, నిరాశచెంది, ప్రబోధము చేయఁదొడంగినవాఁడు, తుదకు "ఆశాచంద్రకాంతిగోచరించినది" అని పరమానందమొంది, ప్రతిగ్రామమునకు ఒక్కొక్క "వాసు" దొరకుచో ఆంధ్రరాష్ట్రమేగాక, భారతదేశమునకు స్వరాజ్యము కూడ లభించునని చెప్పఁగలిగినాఁడు.

వాసుదేవరావు మొదట పాశ్చాత్య నాగరకతా వ్యామోహమునకు లోనయినను, దేశభక్తుఁడై, ఇష్టులచేతనేకాక, అనిష్టులచేత సైతము మెప్పు పొందఁగలిగినాఁడు.

"రామం" తన్ను మొదట నిరసించిన వసంతా కృష్ణారావులచేతనే మన్నన పొందఁజాలె.

వసంత కొంతకాలము స్వార్థపరురాలై ప్రవర్తించినను, చివరకు పశ్చాత్తాపమొంది, గ్రామసేవకు తనజీవితమర్పించి, వాసుదేవరావునే కాక రామమునుకూడ తన్ను క్షమింపవేఁడి చెడిన తనవలపు ఫలింప ధన్యురాలు కానోపె.

పల్లెటూరిపిల్ల జానకి నీలాచలముసాని వలలోనుండి తప్పించుకొని తల్లిదండ్రులు తన్ను విడనాడినను తాను ధైర్యము విడనాడక గ్రామసేవకు పూనుకొని, మెప్పుపొందఁగలిగె.

నాగిరెడ్డి తొలుత చెడుదారి పట్టినను తుదకు వాసుదేవరావు పొత్తు వలన బుద్ధివచ్చి మంచిదారి పట్టుటకు ఇయ్యకొనె.

కృష్ణారావు మొదట దొంగకాంగ్రెసువాదిగాఉండి, కక్కుర్తిపనులుచేసి, మిత్రద్రోహముకూడ చేయుటకు సిద్ధపడినను, చిట్టచివరకు వగపునకులోనై, తన్ను క్షమింప వాసుదేవరావును వేఁడుకొని, పరిశుద్ధినొందె.

గోపాలము వాసుదేవరావుమీఁద కృష్ణారావుతో కలసి కుట్రపన్నుటయేకాక, స్వామిద్రోహము చేయుటకు పూనుకొని, వసంతను అవమానించుటకును, వాసుదేవరావును పొడుచుటకును తెగించి, వాని దుష్ఫలముగా ఖైదులోపడె.

అప్పన్న మొదట దుస్థితిలోఉండి, కృష్ణారావుచే గట్టిగా దెబ్బలు

తిన్నను, వాసుదేవరావు తన్ను ఆదరించి భాగ్యవరము చేర్ప మంచిస్థితిలోనికివచ్చె.

వెంకటరెడ్డియు— పీరన్నయు, తొలుత తెలివిలేని రైతులుగా ఉండియు వాసుదేవరావు పొత్తువలన ఆదర్శపు రైతులు కాఁగలిగిరి.

నీలాచలముసాని మాత్రము అదృష్టవశమున తానుచేసిన దుండగమునకు దండనముకాని, పశ్చాత్తాపముకాని, పొందక తప్పించుకోఁగలిగినది, ఫిర్యాదుతీసుకొనుటకు పోలీసువారు సిద్ధముగా లేరనుకారణముచేత దానిని దండింపక వదలివేసినను నాటకకర్తగారు మఱొకసారియైనను వలయు మెలఁకువ చూపుదురుగాక !

## రసవంతము

ఈనాటకము రసవంతమని మొదటనే అంటిని. నాటకమునకు వీరమో శృంగారమో, కరుణమో, ప్రధానరసముగా ఉండునుగదా? దీనికి ఏరసముప్రధానమని ఎవరుగాని అడుగవచ్చును. శృంగారముకాని, కరుణముకాని, ప్రధానముకాదనుట తేటతెల్లమే. మిగిలినది వీరమొకటియే. ఇందు యుద్ధ ప్రసక్తి కానరామిచే వీరమునకు తావులేదనియే తోఁచవచ్చును. కాని, ఒక్క యుద్ధమువలననే వీరమునకు ప్రాధాన్యము రానక్కఱలేదు. వీరము దయావీరము, దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము, అనినాలుగు తెఱంగుల వెలయు. ఇందు ధర్మవీరము ప్రధానరసము; దానికి తక్కినవి చిఱుతోడులయినవి. శృంగారము పెద్దతోడు; హాస్యాదులును చిఱుతోడులయ్యె.

ఇట్లు ఆంధ్రజ్యోతి రసవంతమగుటచే ప్రదర్శనసమయమున ప్రేక్షకుల డెందములను ఆకర్షించి, వారిని, నివ్వెఱఁగొందఁజేయుట కన్నులార కంటిని.

## భాష

పద్యగీతముల భాషమాత్రము గ్రాంథికముకాని, వచనభాష అంతయు వ్యావహారికమే. నవనాగరక భావములనుబట్టి వ్యావహారికభాష అంతటను

వాడఁదగినదే అగునప్పుడు నాటకమున అదివాడుట వింతకాదు. వినువారికి అది ఇంపుగా ఉండినట్లే కానవచ్చినది. ఇంతకు భాషానిర్ణయము కృతికర్తల పనియేకాన దానినిగూర్చి చర్చింపనక్కఱలేదు. ప్రదర్శన సమయమున రసోత్పత్తికి అది బాధకమనికాక సాధకమనియే తట్టినది.

## కొలికి మాట

తెనుఁగువారికి నాటిదొరతనము గడించుకొనుపస సమకూర్చు తలంపుతో వ్రాసిన యీమేటి—ఆట, మేలిమిపసిఁడినగ. ఇందు పొదిగిన ప్రోడల పాట పద్దెముల రతనములు దీని విలువ హెచ్చించి, సొంపు పెంపొందఁ జేసినవి. ఇంత విలువగలనగను, మన తెనుఁగువారు ఎట్లు వాడు కొందురో కనుఁగొననగును.

## దీవన

ఇట్టి ఆంధ్రజ్యోతి నగను తమతోడి ఆంధ్రుల మేలుకోరి, వారికి కానుకగా ఈయఁగలిగిన నాటకకర్త డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తి గారికి పరాత్పరుఁడు ఆయురారోగ్యైశ్వర్యము లొసంగి, ఇట్టి నాటకములు పెక్కులు ఆయనచే వ్రాయించుఁగాక! తెనుఁగువారు ఇందు నెలకొల్పిన మేలుబంతిని బట్టి తమ ఊళ్ళలో సేద్యమును-చేతిపనులును వెలయించి, కలిమి గడించి, నాటిదొరతనము తెచ్చుకొనుటకు వలంతులగుదురుగాక !!

తెనుఁగుగుడి, అనకాపల్లి.<br>3—౪—౧౯౪౦ } మారేపల్లి రామచంద్రశాస్త్రి

MAMBALAM,
15th January 1940.

## ANDHRA JYOTI.

BY

DR. G. NARAYANA MURTY.

This is a Drama, the importance and significance of which I did not realise until I saw the performance on the 10th inst. at Ellore. This is just the type that is needed for educating the masses and classes on the necessity for reconstruction of villages on the basis of self sufficiency, primarily through hand spinning and hand weaving and establishment of other cottage industries.

The modern British civilisation is constrassted with that of ancient India.

The Author who conceived the plot as well as the ideas so as to educate the masses without becoming tedious or boring deserves congratulations. The actors played their parts with perfect ease and without any effort, making every aspect of the piece quite natural.

At the end of the Drama I was tempted to invite the troupe to Madras where such education as this can impart will be of great help at this juncture.

(Sd) T. PRAKASAM.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు
ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారి

# అభిప్రాయము

10—1—40 వ తేదీన ఏలూరులో ఈ నాటకం చూచేవరకు దీనిప్రాముఖ్యము నేనుగుర్తించలేదు. ముఖ్యంగా నూలువడకుట, నేత, ఇతరగృహపరిశ్రమలు స్థాపించి, గ్రామాలను స్వయంపోషకంచేసి పునరుద్ధరించే ఆవశ్యకతగురించి ప్రజాసామాన్యమునకు బోధించుటకు ఇటువంటి నాటకములే కావలెను.

ఈనాటకములో ఆధునిక బ్రిటిష్‌నాగరికతకు ప్రాచీన భారతీయ సభ్యతకు తారతమ్యము చూపబడినది.

ప్రజలకు కర్తవ్యము బోధించుటలో ఎట్టి విసువూ జనించకుండునట్లుగా ఊహించి కథాసంవిధానమును కల్పించిన నాటకరచయితకు నాఅభినందనములు. నటకులందరు అతిసహజముగా అనాయాసముగా తమ పాత్రలను ప్రదర్శించినారు.

ఈనాటకంవల్ల కలుగు ప్రబోధము చెన్నపట్నములో ఈసమయము చాల ఉపయోగకరముగా ఉండును గనుక ఈ నటమండలిని చెన్నపట్నమునకు ఆహ్వానించితిని.

మాంబళం,
15-1-40. } (సం) టంగుటూరి ప్రకాశం.

కీర్తిశేషులు మహోపాధ్యాయ కళాప్రపూర్ణ
గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారిఅభిప్రాయమునుండి

శ్రీ గుళ్లపల్లి నారాయణమూర్తి పంతులుగారు రచించిన నాటకము వ్రాత ప్రతి స్థూలదృష్టితో తొందరగా చదివి చూచినాను. నాటకాలు విమర్శించి వాటిలోని గుణదోషములు నిరూపించే సామర్థ్యము నాకు లేకపోయినా, గ్రంథకర్తగారు కోరినందున ఈనాటకమును గురించి నాఅభిప్రాయము సంక్షేపించి తెలియజేయడమునకు సాహసించినాను.

వ్యవహారభాషలో అత్యుత్తమమైన నాటకము రచించవచ్చును; ప్రతిభఉండేను. నాటకము ఆడినపుడు సామాజికుల మనస్సులలో ఉత్తేజనము, ఉత్సాహము కలిగి తేచాలు; నాటకము సార్థకమయినట్టే. కాళిదాసు షేక్స్పియరు మొదలయినవారు రచించిననాటకాలవలె ఈనాటకాలు చిరస్థాయులు కావు. అవి ఏవిషయమయి 'ప్రచారము' చేస్తున్నవో అది ప్రజల ఆమోదమునకు పాత్రమైతే అందుకుచేసిన ప్రయత్నము సఫలమయినట్టే!

ఈనాటకములో ప్రస్తుతము దేశములో ప్రచారము కావలసిన ముఖ్యాంశములనేకములు ప్రస్తుతములయినవి. దీనిలో చమత్కారమయిన చిక్కులు ఉన్నవి. అవి క్రమంగానే విడిపోతవి. కథచిన్నది. రంగాలు పరస్పర సంబంధము కలిగి ఉన్నవి. సంభాషణలు వాడుకభాషలోనే! కాపులు, హరిజనులు, రెడ్లు, తమతమ వాడుకచొప్పున మాట్లాడుతారు.

* * *

వాసు వంటివాడు ఒక్కొక్కగ్రామంలో ఒక్కొక్క డుంటే భరతవర్షము అచిరకాలంలో ఔన్నత్యం పొందగల గలదని సూచిస్తూ శ్రీ నారాయణమూర్తిగారీనాటకం రచించారు. ధీరుడైనవాడు నాయకుడై నడుము కట్టుకొని ముందు నడిస్తే పిరికిపందలుకూడా పరాక్రమోపేతులవుతారు.

*　　　*　　　*

జానకి లేశమైనా దోషములేని సుశీల. అట్టివానిని అవివేకులయిన బంధువుల మిథ్యాపవాదమునకు భయపడి, వాత్సల్యమువిడచి, క్రూరులయి, తలిదండ్రులు వెలివేసి దిక్కుమాలిన దానిని చేస్తారు. రామం దానిని పెళ్ళిచేసుకుంటాడు. మన సంఘం ఎంత పాపిష్ఠదశలో ఉన్నదో ఈ ఆనుషంగిక ఘటన సూచిస్తున్నది.

జానకి వృత్తాంతము నాటకకథకు అంగముగా చేయడములో నైపుణ్యము కనబడుతున్నది. స్వస్తి.

రాజమహేంద్రవరం }　　　ఇట్లు,
17—12—38 }　　　గి. వెం. రామమూర్తి

శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు, కాకినాడ.

"కన్యాశుల్కం మహానాటకమే, కాని అది ఎనిమిది నాటకాల సంపుటం—ఆంధ్రజ్యోతిలో కథ గుట్టుంలాగ పరుగెత్తింది. ఒక్క అక్షరము తీసివేయడానికి వీలులేని నాటకమిది.

ఉ భ య భా షా ప్ర వీ ణ

## శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారి అభిప్రాయంనుండి

ఆంధ్రపత్రిక— 23—6—1939

కన్యాశుల్కం తర్వాత మళ్ళా జీవండున్న నాటకాలు చేవగల రచయిత ఒకరు కన్పించారు. ఈనాటి తెనుగు కుక్కగొడుగు నాటకాల్లో శ్రీగుళ్ళపల్లి నారాయణమూర్తిగారి నాటకాలు తప్ప బుట్టాయి — గంజాయివనంలో తులసి మొక్కలు.

ప్రస్తుతం ఆంధ్రజాతిని ఉద్ధరించాలంటే అందరి దృష్టినీ ఆకర్షించే నాటకాలు వ్రాయాలి. ఇంతవరకూ అట్లాంటి సాహిత్య సత్కార్యానికి పూనుకొన్న మహానుభావులెవరూ కనుపించరు.

ఇప్పట్లో శ్రీ నారాయణమూర్తిగారి 'ఆంధ్రజ్యోతి' ఇతి కర్తవ్యతామూఢులయిన తెనుగువారికి చక్కని నిర్మాణ కార్యక్రమాన్ని చూపగలదనుకొంటాను. శ్రీ నారాయణ మూర్తిగారి చిరంతన నాట్యకళానుభవానికి ఈనాటకం నిదర్శనం అని చెప్పవచ్చు.

నాటకాన్ని వికృతపరచే జనాంతికాలూ స్వగతాలూ ఇందులో ఎక్కడా లేవు. ప్రతిరంగమూ ముందుకు పోవలెననే కుతుకమును రెక్కొలుపుతూన్నది. సంభాషణను సహజంగా మొలిచినట్టు నడిపించే నేర్పు ఈరచయిత ప్రతిరచనలోనూ కనబడుతుంది. ఇందులో అది మరీ పక్వంగా ఉంది.

ప్రబోధనాటకాలను రసవంతంగా నడిపించడం బహుకష్టం—ఉపన్యాసాలూ, వాదోపవాదాలూ పేలగొడితే కళ సన్నగిలి పోతుంది.

ఈనాటకంలో ఈచిక్కులు లేవు. ప్రబోధమూ, కళా చేతులు కలిపి సాగినవని నాఅభిప్రాయము.

---

శ్రీ జనమంచి సీతారామస్వామి పంతులుగారి అభిప్రాయమునుండి. ప్రజామిత్ర — 3-9-1939

ఇప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి కాంగ్రెసుమహిమ, దేశాభిమానము, గ్రామోద్ధరణము, మానవసేవ, స్వరాజ్య ప్రాప్తి, ఆంధ్రరాష్ట్రావశ్యకత, త్యాగధురీణత, మొదలగు విషయములకు సంబంధించిన ప్రబోధమే నాటకరూపమున జరుగవలసియున్నది. అట్టి నాటకములలో — నే నెఱిగినంత వరకు "ఆంధ్రజ్యోతి" అగ్రిగణ్యమనుటకు సందేహము లేదు.

తద్రచయిత, డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తి గారు సంఘసంస్కరణాభిలాషి, దేశాభిమాని, కాంగ్రెసు సేవకుడు, యువకుడు, ఉత్సాహమూర్తి. "విడాకులా?" అను నాటకముచే ఇటీవల వన్నెకెక్కిన బుద్ధిశాలి. శక్త్యానుసార ముగా ఆంధ్ర దేశమునకును, ఆంధ్రభాషకును, ఆంధ్రసంఘము నకును సేవయొనరించుటకై నిరంతరము పాటుపడుసచ్చరిత్రుడు.

ఇందలికథ ఆధునికాంధ్రి దేశప్రధానసమస్యాంశములతో నిండి నిబిడీకృతమయిన రమణీయకథ—అసాధారణ చాతుర్యము ప్రతిపదంబున వెల్లడించు మనోహర సంభాషణ ఘట్టములతో నాంధ్రిభాషామాధురీ రసమును విందుచేయు రసవత్కథ. ఇందు కవి వెల్లడించిన ప్రతిభ అద్భుతమైనది.

నాకు తెలిసినంతవరకు సినిమా మహాద్యమ పరులగు కళోపాసకులకు "ఆంధ్రిజ్యోతి" కంటె అనుకూలమైన కథ మరియొకటి లేదు.

# పాత్రలు

| | | | |
|---|---|---|---|
| వాసు | ... | ... | కథానాయకుడు |
| రాఘుం | ... | ... | వాసు అంతరంగికుడు |
| లక్ష్మీపతి | ... | ... | వాసు తండ్రి |
| గోపాలం | ... | ... | లక్ష్మీపతి ఎస్టేటు మేనేజరు |
| కృష్ణారావు | ... | ... | దొంగకాంగ్రెసువాది |
| నాగిరెడ్డి | ... | ... | తప్పుదారిబట్టిన రైతుబిడ్డ |
| వెంకటరెడ్డి | ... | ... | పెద్దరైతు |
| వీరన్న | ... | ... | ఇంకొక రైతు |
| అప్పన్న | ... | ... | హరిజనుడు |
| అయ్యంగార్ | ... | ... | కోఆపరేటివు ఇన్‌స్పెక్టరు |
| కర్మవీరుడు | ... | ... | ఆంధ్రరాష్ట్ర ప్రబోధకుడు |
| | పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ | | |
| వసంత | ... | ... | కథానాయిక లేడీడాక్టరు |
| జానకి | ... | ... | బ్రాహ్మణబాలిక |
| నీలాచలం | ... | ... | వేశ్య |

# కథాసమయము

| | | |
|---|---|---|
| రంగము | 1 | 15—5—1938 |
| ,, | 2 | 16—5—1938 |
| ,, | 3 | 10—1—1939 |
| ,, | 4 | 11—1—1939 |
| ,, | 5, 6, 7,8,9,10, | 12—1—1939 |
| ,, | 11, | 13—1—1939 |
| ,, | 12 | 14—1—1939 |
| ,, | 13,14 | 15—1—1939 |
| ,, | 15,16 | 16—1—1939 |
| ,, | 17,18 | 17—1—1939 |
| ,, | 19,20,21 | 18—1—1939 |
| ,, | 22 | 22—1—1939 |

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.



## ఉపక్రమణిక - రంగం - శ్రీపురంలో వీధి.



(కర్మవీరుడు ప్రవేశం - వయస్సు 40 సంవత్సరాలు, ఖద్దరు అంగవస్త్రం, ఖద్దరు కండువా వల్లెవాటు, మెడలో ఖద్దరు సంచి, తలపాగా, నల్లటిగెడ్డం, పెద్ద కుంకుమబొట్టు, చేతిలో ఆంధ్రపతాకం, సుమారు ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య వేషం)

సీ|| అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజ్యవీరలాంఛనముగా
బలుశస్త్రశాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీధుల కవితకు
పెండ్లిపందిళ్లు కప్పించునాడు
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు
ఆంధ్రసంతతి కేమహితాభిమాన
దివ్యదీక్షాసుఖస్ఫూర్తి తీవరించె
ఆమహావేశమర్థించి ఆంధ్రులార
చల్లుడాంధ్రలోకమున నక్షతలు నేడు|| (రాయప్రోలు)

(అక్షతలు పుష్పాలు చల్లి వెళతాడు.)



ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.



## మొదటి రంగము



(శ్రీపురం-కృష్ణారావు బస - సమయం మధ్యాహ్నం 3 గం॥)

(వసంత ఒంటిగా కుర్చీలో కూర్చుని వార్తాపత్రిక చూస్తూ ఉంటుంది, వయస్సు 24 సం॥ లేడీడాక్టరువేషం, రామం ప్రవేశం: లాల్చీ, పరాయి, గాంధీటోపి, వయస్సు 20 సం॥ దూరంగా ఉన్న ఒక కుర్చీ మీద చేతులు వేసుకొని నిలబడతాడు. వసంత కొంతసేపయాక అతనివేపు చూస్తుంది)

వసంత: ఎవరు మీరు ?

రామం: అన్నయ్యగారిప్పుడే దయచేశారు. అరగంటలో వస్తామని తమతో చెప్పమన్నారు.

వసంత: ఏ అన్నయ్యగారు ?

రామం: మా అన్నయ్యగారండి.

వసంత: అంటే ?

రామం: వాసుదేవరావుగారు.

వసంత: వాసు మీఅన్నయ్యా ? ఎప్పుడు వచ్చాడు ?

రామం: అవునండి. వారు దయచేసి అరగంటయింది.

వసంత : మీరిద్దరూ అన్నదమ్ములే ?

రామం : అంతకంటే ఎక్కువండి.

వసంత : మీరిద్దరూ ఒక్కతల్లిపిల్లలే ?

రామం : అంతకంటే ఎక్కువండి.

వసంత : ఏమిటయ్యా నీమాటలు ! వాసుకి అన్నదమ్ము లెవరున్నారు ?

రామం : తమ్ముడిని నేనొక్కడినేనండి.

వసంత : మీరిద్దరూ ఒక్కతల్లిపిల్లలే ?

రామం : కామండి.

వసంత : మరయితే అన్నదమ్ములేమిటి ?

రామం : భరతుడికి, లక్ష్మణుడికి, రాముడి యందు ఎంత భక్తో వీరియందు నాకంతకంటే వేయిరెట్లు ఎక్కువ భక్తండి.

వసంత : సరే ! బాగుంది. వెళ్ళండి. రమ్మని చెప్పండి.

[రామం వెళ్ళక నిలబడతాడు]

వసంత : వెళ్ళవయ్యా ! ఆ కుర్చీమీద చేతులెందుకు వెయ్యడం ?

[వెళతాడు]

వసంత : (నిలువుటద్దానికి ఎదురుగా నిలబడి తలదువ్వుకుంటూ)

చ॥ అసదృశమైనవిద్యయు, అయాచితలబ్ధధనంబు, కౌగిటన్
కుసుమశరావతారమగు కోమలగాత్రునిబంధనంబు, ఏ
దొసగులులేక సౌఖ్యమున దూగెడు జీవనమబ్బినన్గదా !
పసిడికి తావి యబ్బుగతి భామిని జన్మము సార్థకంబగున్॥

(కృష్ణారావు ప్రవేశం. 50 సం॥ వయస్సు, ఖద్దరులాంగుకోటు పంచ, కండువా, కళ్ళ అద్దాలు, ఆకుచెప్పులు, చేతికర్ర. చెప్పులు విడిచి,

కండువా, కోటు, చేతికర్ర, పాగాకొయ్యకి తగిలించి, కుర్చీలో కూర్చుని వార్తాపత్రిక చూస్తూ ఉంటాడు)

వసంత : ఇప్పుడేదీ ట్రెయిను లేదే! ఎలావచ్చారు?

కృష్ణా : కారులో వచ్చేశాను. ఆలక్ష్మీపురంలో మీటింగు జరుగలేదు. అక్కడ మార్కట్టంతా హడావిడిగా ఉంది. సీజను! మనిషి నిలబడ్డానికే స్థలంలేదు. పాపం! వాళ్ళు త్రోవబోయేవాళ్ళని చేయిపట్టుకొని లాక్కొచ్చినా పది మంది కాలేదు.

వసంత : కాకినాడ మీటింగు బాగానే రిపోర్టుచేశారు. పేపర్లో ఉంది.

కృష్ణా : ఓ! యస్! అక్కడ మీటింగేమిటి! అద్భుతంగా జరిగింది. ఛః! ఇవాళ జరిగినంత పరాభవము, డిసెపాయింటుమెంటు నాజన్మలో ఎరుగను. ఎక్కడికేనా పెద్ద ఊరే గింపులేనిదే నేనెన్నడైనా వెళ్ళానా? వేయిమందికి తక్కువైన సభలో ఎన్నడైనా మాట్లాడేనూ ?

వసంత : మీలెక్చరు వినే అదృష్టం వాళ్ళకుండాలా ?

కష్ణా : అయినా పల్లెటూళ్ళో సభేమిటి? జమీందార్లు మొఖాసాదార్లు ఉన్న ఊళ్ళలో కాంగ్రెసు మీటింగే జరగనివ్వరు. సామ్యవాదపు లెక్చరయితే, తన్నడానికే వస్తారు. ఇవాళ అప్పుడే ముస్తాబయావేమమ్మా ?

వసంత : వాసువచ్చాడట, ఇప్పుడిక్కడకు వస్తున్నానని కబురంపాడు.

కృష్ణా : బాగా కదిపి చూడుమా ! ముందుకు మనమంచి చెడ్డలన్నీ అతనిమీదే ఆధారపడి ఉన్నాయి.

వసంత : మీరుండరా ఏమిటి ?

కృష్ణా : నేనుండడానికి వీల్లేదమ్మా ! ఊళ్ళోకి రాగానే కోఆపరేటివు బ్యాంకువాళ్లు నామీద ఎరస్టువారంటు తెచ్చి నట్టు తెలిసింది. చీకటి పడేదాకా ఎక్కడయినా తచ్చాడి రాత్రి ఇంటికి వస్తాను. నీదగ్గిర ఏమయినా డబ్బుందా ?

వసంత : ఎక్కడదీ ?

కృష్ణా : ఇవాళ ఏవీ కేసులు రాలేదూ ?

వసంత : ఒక పురిటి కేసు వచ్చింది. ఏభై రూపాయిలిస్తే నాసేవింగ్సుబ్యాంకు ఎకౌంటుకు పంపించాను. కొన్ని సామాన్లు వస్తున్నాయి. ఆపార్సెల్ విడిపించుకోవాలి.

కృష్ణా : మరెలాగ ? నాకు అర్జంటుగా కావాలే ! రేపు పొద్దున్న ఆ యేభై యేనా వాళ్ళ నెత్తిని కొడితే వడ్డీకిందైనా జమకట్టుకొని కొంత కాపుదల చేస్తారు. ఇన్నాళ్లూ ఈ కాంగ్రెసు డబ్బొకటి చేతిలో ఉండడంచేత కొంత కాలక్షేపం అయి పోయేది. పోనీ ఈ జిల్లాబోర్డు ఎలక్షనులయినా వేగం తగలడతాయే మో అనుకుంటే బోర్డులన్నీ యేకం చేస్తారట, ఆమంత్రిగారు ఎలక్షనులింకా పొడిగించేశారు.

వసంత : మీరు నిలబడ్డానికా ?

కృష్ణా : నేను నిలబడితే కథే లేదు. కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించడపు పని ఒహటి ఉంది కాదూ నాకు. అందులోనే మనకి కాస్త రామిీ! ఈయేడిక్కడ స్వదేశీ ఎగ్జిబిషను పెట్టిద్దామనుకొంటున్నాను.

వసంత : పోనిద్దురూ! స్వదేశీలో ఉన్న సరుకేమిటి? ఎంత సేపూ సబ్బులూ హెయిర్ ఆయిల్సేనా?

కృష్ణా : స్వదేశీప్రదర్శనాలు నడిపించి సౌధాలు కట్టిన వాళ్లు ఉన్నారు తెలుసునా? కొన్నాళ్ళు ఖద్దరు వ్యాపారం చేసి కొందరు పూటు పడ్డారా! ఇప్పుడు హయాం స్వదేశీది. రేపొద్దుటే ఆ యేభై రూపాయిలు తెప్పించుమా! మరచిపోక! అదనుకా వెంకటాచలమయినా ఊళ్ళో లేకుండా పోయాడు.

వసంత : ఏ వెంకటాచలం?

కృష్ణా : మొన్నాతని కూతురు కడుపునొప్పికి నువ్వు మందిచ్చావు కావూ! ఇలాంటివేవైనా వస్తే అతను ఒక ఒడ్డు కాసేస్తూ ఉంటాడు. ఏఅసరా లేకపోతే మొన్న మొన్నటిదాకా నీకీ చదువెలా చెప్పించగలిగాను! ఒక కోటీశ్వరుడినో లక్షాధికారినో కడకు వేలసంపన్నుడినైనా దన్ను చూసుకోకపోతే కాంగ్రెసులో నాయకుడు కాలేడు. తెలుసునా? స్వతహాగా డబ్బుండి కాంగ్రెసు సేవ చేసేవాడు నూటికొకడు కోటికొకడు.

వసంత : అయితే కాంగ్రెసులో అంతా ఇలాటి అవస్థలు పడుతూన్న వాళ్ళే ?

కృష్ణా : అంతాకాదనుకో! ఇలాటి నావంటి వాళ్ళని కొందరినిచూసే మహాత్ముడు కాంగ్రెసులో పావలా సభ్యత్వము కూడా వదులుకొని మీరూమీరూ ఉరిపెట్టుకొని ఛావండని తనోక మూల పోయి కూర్చున్నాడు. ఇంక మేమంతా, సామ్యవాదమనీ, ఎలక్షన్లనీ గుండా పిండీ అయి పోయి తీరుబడిలేకుండా దేశాన్ని ఉద్ధరించేస్తూన్నాము.

వసంత : మొన్నటి అసెంబ్లీ ఎలక్షనులో మీరు జస్టిసు పార్టీకి పనిచేసినట్టుంది.

కృష్ణా : అప్పుడు వాళ్ళప్రభుత్వం! ఇప్పుడు కాంగ్రెసు ప్రభుత్వం! ఏయెండకాగొడుగు పట్టాలి! ఏ గడ్డీకరవక పోతే బ్రతుకు తెరువెలాగ ?

వసంత : మరీ, జైలుకి వెళ్ళినవాళ్ళకేగాని కాంగ్రెసులో పలుకుబడి రాదంటారు ?

కృష్ణా : జైలుకు వెళ్ళిన వాళ్ళపని ఎప్పుడూ జైలుకి వెళుతూండడమే! దేశంలో ప్రచారానికీ ప్రభోధానికే గాని ఉద్యోగాలు నిర్వహించడానికి వాళ్ళెందుకు పనికివస్తారు. జైలుకు వెళుతూ కాంగ్రెసుప్రబోధం చేస్తూండేశాఖ వేరే ఉండాలి. పదవులు స్వీకరించి పార్లమెంటరీవిధానం నడిపించే శాఖ వేరే ఉండాలి.

వసంత : మొన్నమొన్న కాంగ్రెసులో చేరినా అప్పుడే మీకింత అధికారం రావడం నాకే ఆశ్చర్యంగా ఉంది.

కృష్ణా : పలుకుబడంటే మరేమనుకున్నావు? ఒక్క వేయి రూపాయిలు నావికావంటే నాలుగు వేలమంది పావలా సభ్యులు సిద్ధమవుతారు. దానితో అన్ని అధికారాలు చేతిలో పెట్టుకోవచ్చు.

వసంత : అయితే మీరు దీనికోసం చాలా ఖర్చు పెట్టా రన్నమాటే?

కృష్ణా : అలాగు ఖర్చుపెట్టబట్టే ఇప్పుడీ ఇరకాటం.

వసంత : నాక్లాసుమేటు శాంతాబాయి ఇట్టే ఇంగ్లాండు వెళ్ళి ఎఫ్. ఆర్. సి. యస్ ప్యాసయిపోయిందండీ! ఇవాళ పేపర్లో ఉంది. తిరిగి వచ్చిరావడంతో ఏ ఘోషా ఆసుపత్రిలోనో సూపరెంటుగా వేస్తారు.

కృష్ణా : ఇవాళ వాసు వస్తాడు కాదూ? ఏదో దారి ఏర్పడుతుంది. అమ్మా నేను వెళుతున్నాను.

వసంత : వాసు వచ్చే వేళయింది. కాస్తసేపు ఉండ కూడదూ!

కృష్ణా : నేను సావకాశంగా జాగ్రత్తగా అతనితో మాట్లాడుతానుకాదూ! అతనుండగా ఈ బ్యాంకుగొడవ వస్తే బాగుండదు.

(కృష్ణారావు వెళతాడు)

[వసంత : నిలువుటద్దం ఎదుట అలంకారం సదుకుంటూ ఉండగా వాసు ప్రవేశం. వాసు పాశ్చాత్యదుస్తులలో ఉంటాడు. వయస్సు 25 సం|| రములు.]

వసంత : నా ఉత్తరం అందిందా ?

వాసు : ఆహా ! మీ నాన్నగారున్నారా ?

వసంత : లేరు. ఎక్కడికో మీటింగుకని వెళ్లారు.

వాసు : ఆయన మీటింగులు, నాన్‌కోఆపరేషను ఇంకా వదలలేదు?

వసంత : అన్నట్లు ! నీరిజల్టు తెలిసిందా ?

వాసు : అది చెప్పడానికే వచ్చాను. ఫస్టు క్లాసులో ప్యాసయాను.

వసంత : కంగ్రాట్యులేషన్సు(Congratulations)చంద్రా!

వాసు : థేంక్సు(Thanks) చంద్ర ఎవరు? మంత్రసానా ?

వసంత : అవును.

వాసు : అప్పుడే ప్రాక్టీసు ఆరంభించావన్నమాట !

వసంత : ఆఁ! ప్రాక్టీసూ లేదు మన్నూ లేదు. ఈచంద్ర ఇదివరకెక్కడో మంత్రసానిగా పనిచేసిందట, ఏదైనా కేసు వచ్చినప్పుడు పిలిస్తే వస్తుంది. నీప్రోగ్రాము ఏమిటో చెప్పు!

వాసు : నాకేమి చేయడానికీ తోచలేదు. ఆలోచించిన కొద్దీ తల తిరిగిపోతూంది.

వసంత : ఈ వెధవఊళ్లో నాకు ప్రాక్టీసు ఏమిటి పోనిద్దూ!

మాలపల్లిలో మంగళాష్టకాలని! నిజంగా ఈఊళ్లో నేను విజిటుచేయడానికి తగినవి పట్టుమని పది ఇళ్లు లేవు. ఇంకా నువ్వువచ్చి ఏపెద్దప్లాను వేస్తావో అని కొండంత ఆశ పెట్టుకొని ఉన్నాను నేను! మన అమెరికాప్రయాణం ఉన్నట్లేనా?

వాసు : ఓ యస్ ! అలాగే వెళదాం నువ్వు హార్వార్డు యూనివర్సిటీలో మెడిసిన్, నేను కేలిఫోర్నియాలో ఎగ్రికల్చరు, డిగ్రీలు తీసుకువస్తే బాగుంటుంది కాదూ !

వసంత : ఏదీ ! ఏదీ ! ఒక్క స్వీటుకిస్!

(వసంత, వాసు చేయి ముద్దుపెట్టుకొంటూఉండగా వాసు, ప్రేమభరితమైన కీగంటిచూపు.)

వసంత : నన్ను నిజంగా, మనస్ఫూర్తిగా, ప్రేమిస్తున్నానని ప్రమాణం చేయి!

వాసు : వెర్రిపిల్లా ! [వసంత వీపు నిమురుతాడు]

వసంత : కాస్త టీ పుచ్చుకుందువుగాని రా !

వాసు : నువ్వు బీచికి వస్తావా ? అలా చల్లగాలికి తిరిగి వద్దాం! పనుందా ?

వసంత : తోవలోనే ఒక్క కేసు చూడాలి. టాక్సీ(Taxi) చేసుకుపోదాం !

వాసు : మనం కలుసుకొని ఏడాది అయిందికాదూ ?

వసంత : ఆ ! దగ్గిర దగ్గిరగా !

వాసు : ఈ ఏడాదిలో నువ్వు ఎంత ఎదిగిపోయావు !

వసంత : అంటే ?

వాసు : రా ! బీచికి రా ! చెబతాను. ఏవిధంగానో !

[గాఢంగా చూస్తాడు]

వసంత : ఆ చూపేమిటి ? అంత బరువుగా చూస్తే నేను భరించలేను సుమా !

[వాసు చక్కిలిగింత పెడతాడు. ఇద్దరూ నవ్వుకుంటూ వెళిపోతారు.)

తెర

---

ఓం

బ్రహ్మకృపాహికేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## రెండవ రంగము.

---

శ్రీపురంలో పార్కు. సమయం సాయంత్రం 5 గంటలు.

[బహిరంగసభ - ఆంధ్రమాతపటం వేలగట్టి ఉంటుంది - కర్మవీరుని ప్రబోధం, తెర ఎత్తగా కర్మవీరుడు కొందరు సభికులు, ఆంధ్రమాతపై జాతీయగీతము పాడుతూండగా వాసు రామం ప్రవేశం]

దుర్గా!

కర్మ : "వందే! సుస్థిరశక్తిశాలినీ - ఆంధ్రజననీ -
స్వాతంత్ర్యమోహినీ ||వందే||

1) సుజలసుఫల - శ్యామలదళసుందర
సస్యదాయినీ - జయవిహారిణీ ||వందే||

2) కోటిద్వయసుత - సింహగర్జితా
ప్రబలప్రతాప - స్వరాష్ట్రస్థాపిత
సుస్మితసరితా - సుగుణపావనీ
జయజయమాతా - ఆంధ్రావనీ ||వందే||"

వాసు : ఎవరు వారు ?

రామం : వారిని కర్మవీరుడంటారు. గొప్పత్యాగి.

కర్మ : [కొంతసేపు నిశ్శబ్దం. ఒక్కసారిగా ఆవేశపూరితుడై నిట్టూర్పుతో] తల్లీ! ఆంధ్రమాతా! ఇంకమాకేమి మిగిలినదమ్మా!

సీ|| నాజాతి పూర్వప్రథాజీవరహితమై
శక్తి నాడులయందు చచ్చిపోయి,

నామాతృభూమి తేజోమహాశ్చ్యుతిని బ్ర
    హ్మక్షత్రతేజంబు మంటగలిపి,
నామాతృభాష నానాదుష్టభాషల
    యాథార్థ్యమును తల నవహరించి,
నాతల్లి నేల నేనాటి వాచారముల్
    పైమెరుంగులు చూచి భ్రమసిపోయి
ఏమి మిగిలినదీనాటి, కిట్లు పొంగు
లాలయు వర్షానదీగభీరోదకముల
దైన్యగర్భచారిత్రముల్ దక్క, భిన్న
గిరిశిఖరదుర్గపరిదీన గీతి దక్క॥ [విశ్వనాథ]

ఆసేతుకటకము ఆంధ్రభూమిని పాలించి ఓరుగల్లున వర్ధిల్లిన కాకతీయవంశజుల ప్రతాపము, పంపాసరోవర ప్రాంతమున విద్యానగరము పాలించి దిగ్విజయ మొనర్చిన శ్రీకృష్ణదేవ రాయల ప్రతిభ, "వేంగీచాళుక్యుల పరాక్రమము, పల్నాటి వీరుల వీరవిహారము, క్షత్రియపుంగవుల క్షాత్రము, నాయక రాజుల నాయకత్వము, కమ్మవీరుల కదనపాండిత్యము, రెడ్డి యోధుల రోషావేశము," ఆహా! కాలగర్భమున లీనమై విస్మృతిసాగరమున అదృశ్యమయినవే! ఆంధ్రమాత! సిగ పూవాడని మహాగౌరవము పొందిన స్వాతంత్ర్యదేవత! అమ్మా! ఎంతగతిపట్టినది! నీ స్వాతంత్ర్యము, సారస్వతము, కళలు, రాజనీతి, వాణిజ్యాదిక్షాదకుతలు, ఏమయినవమ్మా! చక్రవర్తిచేత పల్లకీ మోయించిన ఆంధ్రవాణివి; రోమనులతో నౌకావ్యాపారమునలిపిన వాణిజ్యలక్ష్మివి; పసుపుముద్దలతో

పతులకు రోషము గుడిపిన వీరాంగనల గన్న వీరమాతవు; జాతికి ప్రాణప్రతిష్ఠ చేసిన అమరావతీ శిల్పదేవతవు; నీఅభ్యుదయము, నీఐశ్వర్యము, నీజాతీయపౌరుషము, నీ దేశీయ కళలు, నీసాహిత్యరాజ్యము ఏమయినవమ్మా! ఆహా! తలచుకొన్న గుండె జలదరిస్తున్నది. ఆంధ్రులు జీవచ్ఛవములైనారు. ఆంధ్రరాష్ట్రము శ్మశానమైనది. ఆంధ్రపౌరుషము చచ్చినది. ఆంధ్రభాష సంకరమైనది. ఆంధ్రజాతీయత మృగ్యమైనది.

ఉ॥ పోటరి కృష్ణరాయనృపముఖ్యుడు ఖడ్గము పట్టునాడు కం
దేటికి గూడ పౌరుషము నిండిన గాధలు సెప్పి మీసముల్
దీటిన తెల్గువీరులకు నేడు కనుంగవ చెమ్మగిల్ల వ్యా
ఘ్రాటవి గూడుగట్టె నవురా! అతడెక్కిన సింహపీఠికన్.

[జాషువా]

వాసు: మహాశయా! కడుపు తరుగుకొని పోయేటట్లు హృదయవిదారకంగా దుఃఖము పొంగిపొరలివస్తూ ఆంధ్రమాతదుస్థితికి మీరు చింతిస్తున్నారు. మీవృత్తాంతము, మీ సందేశము విస్తరించి చెప్పి నన్ను ధన్యుని చేయరా!

కర్మ: [వాసువైపు తీక్ష్ణంగా చూస్తాడు]

రామం: [వాసుని చూపి] వీరు ఈ యూరిలో లక్ష్మీపతి అనే గొప్ప స్థితిపరుల కుమారులు. వ్యవసాయశాఖావిద్యయందు పట్టం పొందారు. పేరు వాసుదేవరావుగారు. నేను వారికి సేవకతుల్యుడను.

కర్మ: లక్ష్మీపతిగారు నాకు చిరపరిచితులు. నేను చాలా

కాల మిక్కడ నివసించిన వాడనే! ఆంధ్రమాత దీనాలాపం నన్నాహ్వానించినది. ఆంధ్రోద్యమప్రచారానికి నాజీవితమర్పించాను. నాయనా! నువ్వేమి చేయదలచుకొన్నావు ?

వాసు: ఇప్పటి కేమీ నిశ్చయించ లేదు. నామనస్సు పరిపరివిధాల పోతున్నది. ఏమీ శాంతిలేదు. అనుక్షణమూ మెదడులో తుపాను రేగుతూన్నది. కాంగ్రెస్సు, సంవత్సరం పొడుగునా అధికారాలు, పదవులు, ఎన్నికలల్లోమునిగి నిర్మాణకార్యక్రమంపై చిరుకన్ను వేసింది. నాజీవితం దేశానికి ఏవిధంగా సప్రయోజకంగా అర్పించగలనో తెలియక. ఒక నిశ్చయము, సంకల్పము, దారి, తెన్ను లేని వ్యర్థజీవనం గడుపుతూన్న శుష్కజీవిని. ఈ అంధకారంనుండి తప్పించి సన్మార్గం చూపే జ్యోతికోసం నిత్యము ప్రార్థిస్తున్నాను.

కర్మ: నీవంటి ధన్యజీవులు దేశానికి అమూల్యమైన అలంకారాలు. తన జీవనానికి లోటులేకుండా వేలకొలది జనాన్ని పోషించే సమర్థతగల నీవంటివారి జీవితాలకి దేశసేవకు దిగడంకంటె ఉత్తమప్రయోజనంలేదు.

సీ॥ మెరయింపవలె తెల్గుదొరసాని మొగసాలి
ఆంధ్రరాష్ట్రంబు సింహధ్వజంబు,
పట్టింపవలె ఆంధ్రపౌరుషలక్ష్మికి
కుచ్చులనీలాలగుబ్బగొడుగు,
సవరింపవలె ఆంధ్రసాహిత్యకన్యకు
కడచన్న తొంటి బంగారుభిక్షు,

కావింపవలె ఆంధ్రగానకల్యాణికి
త్యాగరాజస్వామి దర్శనంబు,
అరులనదలించి బ్రహ్మనాయకునికోడి
పలికి పోయిన ధైర్యసంపద్విభూతి
పెంపునెత్తావివలె గుబాళింపవలయు
కలసిరావోయి రాష్ట్రదీక్షాతపస్వి (జాషువా)

ఆ ఆంధ్ర తేజము సమసిపోయినది. ఆదీపకళిక ఆరిపోయినది. ఆంధ్రపుత్రుడవు! కన్ను తెరచి చూడు! రా! ఆంధ్రమాతపిలుపు అందుకో! పట్టాభిషేకం కట్టుకో! జయమాల ధరించు! ఇదిగో, ఆంధ్రపతాకము. నీచేతితో ఆంధ్రజ్యోతిని వెలిగించవోయి!

ఉ॥ జారినదేశగౌరవము చక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ బాలనచేసి, సమానరాష్ట్రముల్
గూరిమినాదజేయ తెలుగుంబుడమిన్ గయిసేయవయ్య! దీ
క్షారతి నాంధ్రపుత్రుడ! జగజ్జనధర్మమె దృష్టినిల్పుచున్॥
(రాయప్రోలు)

నాతో రమ్ము! ఈదుస్తులు విడిచిపెట్టు! ఈపాశ్చాత్యసభ్యతా పంకము కడిగివేయి! ఆంధ్రపౌరుషము జారిపోనీక తేర్చుకొమ్ము! ఆంధ్రరాష్ట్రదీక్ష వహించు!

శా॥ దీక్షాకంకణమున్ ధరించి, జనయిత్రీదాస్యవిచ్ఛేద నా
పేక్షల్ పొంపిరివోవ, ముజ్జగము కంపింపంగ లేవమ్మ! నీ
దక్షత్వంబునకడ్డులేదు; చరితార్థత్వంబునీకబ్బు; ఏ
పక్షుల్ కూసిననేమి లెక్క; కడిమిన్ బాలింపుమా సోదరా!
[తుమ్మల]

వాసు: [కొంచెం ఆలోచించి, ఒకనిశ్చయానికివచ్చి]

వాసు : చిత్తం! తల్లీ! ఆంధ్రమాతా!

శా॥ ఆశల్ కౌతుకపూర్ణచంద్రికలు పూయన్, దుర్దినాచ్ఛాద మా
కాశమ్మున్ విడిపోవ, నూతనకళోత్కృష్టాప్తమై మాతృపూ
జాశోభల్ దయివారు నీశుభదినోత్సాహంబు నీక్షించి నీ
యాశీర్వాదము లిమ్ము పుత్రునకు అంబా! ఆంధ్రదేవీమణీ ॥

(రాయప్రోలు)

రామం : జే! వాసుదేవరావుగారికీ జే!

వాసు : జే! కర్మవీరునికీ జే!

కర్మ : జే! ఆంధ్రమాతకు జే!

అందరు : అంధ్రమాతకూ జే!

(కర్మవీరుడు పాడుతూ దారితీయగా అందరూ అనుకరిస్తూ వెనక వెళతారు.)

పాట-మోహన-మధ్యమం.

ఆంధ్రమాతృపాదార్చనకై నీ ఆత్మనొసంగుమురా! భ్రాతా!
కనకకుసుమముల కాన్కలిడెదవో కంటినీర రాల్చెదవో! భ్రాతా!
॥ ఆంధ్రమాతృ ॥

తెర

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## మూడవరంగము.



సమయం, రాత్రి గం|| 8-30 లు.

(నీలాచలం ఇల్లు. నీలాచలం వయస్సు 25 సం||లు శృంగారించుకొని ఉంటుంది. గదిలో రెండు కుర్చీలు. ఒక పీట ఉంటాయి. లయవేయడానికి తియగటిగురుజులాంటి ఒకకర్రపట్టుకొని ఇంకోగదివేపుచూస్తూ)

నీలా: రావే!......రా!......అమూర్ఖంవేటి రమ్మంటూంటే! నాకుగాని చిర్రెత్తిందంటే యీవుమీద గుమికీలిచ్చేస్తాను. ఎంతతెగులుగా ఉందే నీకు! (లేచి వెళ్ళి చేయిపట్టుకొని జానకిని లాక్కొస్తుంది. జానకి వయస్సు 13 సం||లు; పైటపరికిణీ; వెక్కి వెక్కి ఏడుస్తూ తలవంచుకొని నిలబడుతుంది) 'తలెత్తు, నడుముమీద ఇలా పెయ్యేసుకో' (అని నడుముమీద చెయ్యి వేయించి తాను పీటముందుకూర్చొని లయవేస్తూ, నీలాచలం తిల్లానాపాడుతుంది)

"నాదరతిల్లాతానా తానాదిరిదిరి తోం, తోం, ధిమీ
ధిమీతోంతోంధిమీయనినా|| [జానకి నడుముమీదచెయ్యితీసేస్తుంది]

నీలా: పాడవేం! పోనీ! ఈపాట పాడు.

జావళీ-కాంభోజి-అట,

మొగమాటముమాని, మోముచూపవదేరా
తగనానేతోలిసారెకు, ఘూర్తగోపాలా|| మొగ

జానకి: (మాట్లాడదు]

నీలా : నోరిప్పవేటే ! ఆకరుకి రసాబాసు సేసేస్తావు కాబోలు. పోనీ ! గాంధీపాట సెబతాను. పాడు!

జావళీ– 'సఖియ ప్రాణ' వరుస.

సఖుడ గాంధీమహాత్ముని చూచినావా లేద చెపుమా ||
అఖిలభారతదాస్యమంతా అడపజాలు ధీరుడతడే||

జానకి : [పాడదు] నీలాచలం కోపంగా లేచి బుగ్గలు పొడుస్తూ]

నీలా : నీకేం బుద్ధిగ్యానం లేదూ ! సెప్పేది మనిసికాద నుకున్నా వేటి ? రేపు ఆరెడ్డి కన్నెరికాని కొస్తాడుగదా ! నువ్విలా మెకిలిగుంటలా నిలబడితే ఏటనుకుంటాడు ?

జానకి : [మాట్లాడదు]

నీలా : నామాటినవూ ! మాఅమ్మవికాదూ ! నాతల్లివి కాదూ ! నిన్ను బతిమలాడుకుంటానే ! సూశావా ! నువ్వు మొన్న పెద్దమనిసివయినప్పుడు నీకోసం ఎంత కర్చుపెట్టి సంబరం చేశామో! ఈఒక్కపూటా నాపరువునిలబెట్టు! సిద్ధాన్నం పాడు సేసుకోకు. అయిదువందల కొప్పుకున్నాం. గదిఖర్చుల కేభై రూపాయి లిచ్చేశాడు. ఈ పాటిబేరం ఈ రోజుల్లో ఎవత్తెకుంది ? జానకి :[మాట్లాడదు]

నీలా : నీకు కట్టుకాసులపేరు సేయిస్తానే ! నాపలకసర్లు నీకిచ్చేసీదా ? [తన మెడలోని పలకసర్లు తీసి జానకిమెడలో వేయబోగా జానకిచేతితో తోసేస్తుంది. పలకసర్లు క్రిందపడిపోతాయి]

నీలా : నువ్వు మంచిగా సెబితే యినవే ! ఇంతతెగులేం? సెప్పినట్టూ ఇంటావా ? ఇంటావా ? ఇంటానను! అను!

(అని చేతిలోనికర్రతో కొడుతుంది)

జానకి : (ఏడుస్తూ) నన్ను పీకనులిపి చంపేయి.

నీలా : సంపేడానికే తెచ్చుకున్నాను నిన్ను. మాటకు మాటా జబాబు సెబుతున్నావు.

జానకి : నీకిదేమేనా న్యాయంగా ఉందా? బ్రాహ్మలం గదా! నన్ను వెధవసానివృత్తిలో పెట్టడానికి బలవంతంచేస్తు న్నావు. నీకిదేమేనా శ్రేయస్సేనా? ఇంతపాపం మూటగట్టు కుంటే నరకంలో యముడు నిన్ను ఏంచేస్తాడో తెలుసునా?

నీలా : అబ్బోసి! నోరెగుస్తూంది. గుడ్డొచ్చి పిల్లని వెకు పెట్టిందట. మీ బ్రామ్మలు మానీతయినవాళ్ళనీ!

జానకి : ఇరవై రోజులాయి నన్ను గదిలో పెట్టి తాళంవేసి కడుపు మాడుస్తున్నావు గదా! నీకిదేమయినా బాగుందీ? నన్ను మాయచేసి, మభ్యపెట్టి మావాళ్ళింటికి దిగబెడతానని తిరపతినుంచి తీసుకువచ్చావుగదా?

నీలా : తెగనీలుగుతున్నావేటి? చక్కా తలదువ్వి బొట్టెట్టి కాటికపెడితే తెగులా? సింపిరిదెయ్యంలాగ సేసుకోవడ మేమిా? బంగారులాగ రెడ్డివచ్చి అందలంమిాదకూచోపెడతా నంటూంటే తీపుదిగదీసిందా! మిానాన్నగారు రానీ నీకు తెగులణుస్తాను.

జానకి : నాకు నాన్నగారెవరే? వెధవ నాన్న వెధవ అమ్మ పీని! నువ్వు నాకు తల్లివిటే? పంచమహాపాతకాలు మూట గట్టుకున్న రాకుసిముండవి కాని.

నీలా : ఏటే పేల్తున్నావు! ఎవరేముండ? ముండలూ రండలూ మిాకులాల్లోనే గాని, మాజాతికి మెదవరికం లేదు.

మాజాతివాళ్ళెప్పుడూ నిత్యసువాసినీలు. ముందు మా సెయ్యి పడితేనేగాని మీబాప్మిన్మల మంగళసూత్రం కుత్తికంటూ పని కేరావు.

జానకి : వెధవ జాతసి ! జాతినీ వృత్తినీ చూసి పొంగి పోతున్నా వేమిటి ?

నీలా : యెదవన్నమాట మళ్ళీ అనొద్దని సెప్పలేదూ? నోటి కొచ్చినట్లూ పేల్తున్నావులే! ఇలావచ్చినిలబడు! నడుంమీద సెయ్యేయ్యి! ఆతనిదగ్గర ఓముక్కైనా అబినయం పట్టకపోతే బేరంచెడిపోదూ!

జానకి : నావంతు నువ్వాడి ఆడబ్బంతా నువ్వేపుచ్చుకో!

నీలా : ఎముకలిరగ గొడితేనే గాని నీకు బుద్ధిరాదు. [కొడుతూ] నేన్గాడితే నువ్వేందుకు ? బెల్లంమొత్తినరాయిలాగు నిలబడడాని కేటి ! (కొడుతూండగా అమ్మో అమ్మో అని జానకి ఏడుస్తుండగా గోపాలం ప్రవేశం. గోపాలం వయస్సు 35 సం|| లు సిల్కు చొక్కా, సిల్కు పంచ, ఖండువా, సిగరెట్టు.)

గోపాలం : ఏమి టేమిటి ? ఈఅల్ల రేమిటి ?

నీలా : ఏముంది మామూలల్లరే! ఇరవైరోజులాయి ఒక్కలాగ కాల్చుకుతింటూంది. పోనీ, రేపా రెడ్డి వస్తాడన్నారని ఓ ముక్క చెప్పి ఓహస్తంఅబినయం నేర్పుదామంటే కదలదు సూడండీ !

గోపా : రేపు రావడం కాదే ! ఇంకోగడియకు వస్తాడు. ఇవాళవచ్చి ఓసారి చూసుకుంటా నన్నాడు.

నీలా : నిజంగానే ? మరెలాగ ? ఇదేం ఖర్మాట దక్క-నియ్యాలా ఇవాళ!

గోపా : బతిమాలి చూదాం. అప్పటికీ లొంగకపోతే మొహం కనబరచేసి మామూలుగా గదిలో పెట్టి తాళం వేసేయి ! (జానకితో) నామాట్ట వినవూ ! అమ్మవు కావూ! ఇదుగో ! నీకు మూడంతస్తుల మేడ కట్టిస్తాడు. మహారాణీ లాగు కాలుమీద కాలేసుకుని కూర్చుంటావు. నౌకర్లూ, చాకర్లూ మహాభోగం ! లక్షాధికారిని చేపట్టేవనుకో. (జానకి ఏడుస్తుంది)

నీలా : ఇంత ఆలస్యంసేశారేం ? అతడివాళే వస్తానంటే ఆమాట ముందొచ్చి సెప్పక్క-రలేదూ ?

గోపా : ఇదిగో ! మ్యాప్రయిటరుగారబ్బాయి వాసు దేవరావున్నాడుకాదూ ! అతని కేదో డబ్బుకావాలనీ రమ్మనీ కబురంపాడు. అతనికి సర్దుబాటుచేసి వచ్చేసరికి ఈవేళయింది. ఇవాళేనా తిండి తిందా ? ఇది లోపల పెట్టు. (మిఠాయిపొట్లాం యిస్తాడు.)

నీలా : అబ్బే! ముట్టుకోందే ! నాచేతితో తిండితినదట ! ఆశారమట. చక్కా- పాలూ, పళ్లూ పెడితే వినాయకుడిలా కూచుని ఆరగిస్తుంది.

గోపా : అమ్మన్న ! చూడు ! కాస్త తిండి తిను. ఎందు కలా ఏడుస్తావు ? పోనీ ! నాచేతితో పెడతాను. రా ! బ్రాహ్మణ్ణి నే పెడితే తినడాని కేమీ? (నీలాచలం మిఠాయిపొట్లాం దాచివస్తుంది,)

జానకి : నువ్వు బ్రాహ్మడు చేసే పనులే చేస్తున్నావా ? నీకు రౌరవాదినరకాలు, తప్ప గతులున్నాయా ? ఛీ ! నన్ను ముట్టుకోకు. తెల్లారేసరికి నాశవాన్ని మీరు చూస్తారు. అంతే! ఇన్నాళ్లూ సహించాను. ఏనాటికేనా మీకు కనికారంపుట్టి మాయింటికి దిగబెడతారేమో అని.

గోపా : ఇదేమిటే ఈ ఉగ్రస్వరూపం! మహాంకాళిలాత యారయిందీ .

జానకి : ఇవాళ మీరు తలపెట్టినపని నా అంతు చూడడానికే. నాకెందుకొచ్చిందోయి బాబు ! ఆ తిరపతియాత్ర ! కాళ్ళుపడిపోయేలాగు తిరపతికొండెక్కి దిగివస్తే ఆ దేవుడికి ఎంతకనికారం లేకపోయిందోయి నాయనా ! నాపాలింట శనిలా వచ్చింది పదిరూపాయిల టిక్కెట్టూ ! మా అమ్మా నాన్నా నాకోసం ఎంత ఏడుస్తున్నారో ?

గోపా : (దగ్గరకువెళ్ళి గెడ్డంపట్టుకొని బ్రతిమాలబోతాడు)

జానకి : ఛీ ! నన్ను ముట్టుకోకు. నువ్వు పరమ పాపివి. దుర్మార్గుడివి. బ్రాహ్మణపేరుపెట్టుకొన్న కటికివాడివి. ఛండాలుడివి. నీకూతురయితే ఇలాగే చేసుకుంటూవా ? నీకు తోడబుట్టినవాళ్ళు లేరూ ?

గోపా : అబ్బో ! పిట్టకొంచెము, కూతఘనమూను.

(తలుపు తలుపవే చప్పుడు)

గోపా : వచ్చినట్టున్నాడే !

నీలా : సచ్చాం!అమ్మా!నామాటవినవూ!నాతల్లివికావూ! ఒక్కనిమిషం అల్లరిచేయకుండా వుండూ !

(ఇద్దరూ నాగిరెడ్డిని ఎదుర్కొనిరావడానికి వెళతారు. ఈలోపుగా జానకి జుత్తు విరగబోసుకుని మొగమంతా కాటుకచేసుకొని వికారంగా ఉంటుంది. నాగిరెడ్డి: సిల్కుకోటు, పంచ, ఖండువా, చేతిలో సిగరెట్టు, చేతికి రవ్వలగొలుసు, రిస్టువాచీ, 25 సం॥లు వయస్సు, గోపాలం, నీలాచలంతో ప్రవేశం, ముగ్గురూ కొంతసేపటివరకు జానికివేపు చూడరు.)

నీలా : ఇలాదయ చేయండి అల్లుడుగారూ !

గోపా : కూర్చోవయ్యా నాగిరెడ్డీ! ఈజీఛెయిర్లో కూర్చో!

నాగి : ఏటీ ? ఇది అద్దిల్లేనేటి ?

నీలా : మీదయుంటే సొంతిల్లు ఎంతసేపు రావాలి.

నాగి : ఎంతేటి అద్దె ?

నీలా : నెల కిరవై.

నాగి : ఏటీ! దీనికే ఇరవైరూపాయిలా ? ఇంతకంటె పెద్ద ఇల్లునాది మొన్న పదేను రూపాయిలకే యిచ్చేశాను.

నీలా : ఇల్లు కట్టించేదాకా అలాంటిదో ఇల్లు అయినా ఇప్పించండి.

నాగి : (జానకివేపుచూసి) అదేటి అత్తయ్యా ! ఆయిగ్గరమే నేటి నీకూతురు ?

నీలా : (జానకివేపు ఆశ్చర్యంగాచూసి) ఇదేమే ! నీకొచ్చిన రిమ్మ ! ఇదంతా అలకే ? నీఅలక బంగారంకానూ ! ఇంతసేపూ బంగార్లాగ పదంపట్టి ఇప్పుడీ అలకేమే నీకు! పదపద! ఇంట్లోకి పద ! (చెయ్యిపట్టుకొని లోపలికి లాక్కుపోతుంది. తిరిగీ వెండిపళ్లెంలో మిఠాయిపెట్టి తెచ్చి రెడ్డి ఎదుట పెడుతుంది) పుచ్చుకోండల్లుడు గారూ !

మూడవరంగము.

నాగి : ఏదీ! నీకూతురుగాజులసేత్తో తినిపిస్తే, బాగుంటానా?

నీలా : రేపు మూర్తంకానిదే ముట్టుకుంటారా? (గోపా లంతో) ఇంతసేపూ ఎంచక్కా పదంపాడి అబినయంపట్టింది. పిరోస్తే ఎంతో చక్కా పాడుదామని ముచ్చటపడింది. ఇంతలో నేనేంచేశాను! ఈపదానికే నీకిస్తారే రెడ్డిగారు ఐదు వందలరూపాయల కట్నుకాసులపేరూ అన్నాను నోరుజారి. ఆమాట పట్టుకుందండీ! ఇప్పుడు కావాలని కూచుంది. తలచి నప్పుడే తాతకిచ్చెళ్ళి! మీరు వచ్చేసరికి చూశారుకారూ! అదే అల్లరి!

గోపా : చూశానుగానూ? నేనెంతసేపు బోధపరచాను! బొత్తిగా చిన్నతనం!

నీలా : దానికిత్తోడు వొళ్ళుమాలినసిగ్గు! దీనిసిగ్గు బొగ్గులు కానూ! తండ్రివద్దకు వచ్చి నిలబడదూ! ఆడదాన్నికదా! తలంటి నీళ్ళుపోయడానికి నన్ను దగ్గరికి రానియ్యదుకద! ఏసంసారికీ లేని సిగ్గొచ్చింది దీనికి.

గోపా : అసలు మీవంగడంలోనే ఉంది. నీకన్నెరికం నాటికి నువ్వూ నన్ను ఇలాగే బాధపెట్టావు. (నీలాచలంసిగ్గునవ్వు)

నీలా : అల్లుడుగారుండగానే! మీకు మరీ చిన్నతనం వస్తూంది.

గోపా : కన్నెరికపురోజులు జ్ఞాపకమొస్తున్నాయి.

నీలా : (తమలపాకులు చిలకలుచుట్టి రెడ్డికి ఇస్తుంది.)

నాగి : ఏటో! నాసరదా తీరింది కాదు.

నీలా : మీరు తొందరపడితే ఎలాగ! రేపు ఎంత తంతు ఉందో తెలుసునా? మీఇద్దరికీ తలంటి నీళ్ళుపొయ్యాలి.

మాకులంవాళ్లందరికీ భోజనాలుపెట్టాలి. గదిలో కెళ్ళాక మావాళ్ళందరికీ తాంబూలాలు, బలప్రదానాలు ఇవ్వాలి. మంగళారతిపళ్ళెంలో మీరు నూటపదార్లుకట్నంవేయాలి.

నాగి : అదేటి ! మళ్ళా కొత్తబేరం ?

నీలా : అది కొత్తబేరం కాదు. మామూలే !

నాగి : ఒప్పంచంలోదేనా ?

నీలా : అది ఒప్పందంలోది ఎందుకవుతాదీ ! గదిఖర్చు మంగళారతి కట్నం వేరేను.

నాగి : అలాగయితే నావల్లకాదు సుమా ! కావలిస్తే పదారు రూపాయిలేస్తాను.

నీలా : ఎవరేనా నవ్విపోతారండీ! అయ్యో! అల్లుడుగారిలా అంటారేటీ! నిన్న పోలిసెట్టికొడుకు వాళ్ళ కాంతానికి రెండు నూటపదార్లేశాడు.

నాగి : కోమటోళ్ల కేటిపోయింది. రైతులకడుపు కొట్టుకొని బలిసిపోతున్నారు కోమటోళ్లు. సరే! చెప్పు! తరువాత తంతేటి?

నీలా : తరువాత తంతు ఇంకేముంది? అదికూడా సెప్పాలి కాబోలు.

నాగి : మరినాకేటి తెలుస్తాది?

నీలా : ఆతరువాత మాఅమ్మాయి తెలివితేటలు మీకే తెలుస్తాయి. మీరెలాంటివారో అది ఎరగదుకదా! మీకు అందంకావాలో, సందంగావాలో, సంగీతంకావాలో, సాహి

త్యంకావాలో ఒక్కచణంలో మిమ్మల్ని కనిపెడుతుంది.

నాగి: ఏటంతా ఆచ్చర్యం సెబుతున్నావు. ఒక్కచనంలో ఎలాకనిపెట్టేస్తాది ?

నీలా: ఏళ్ళకున్న గొప్పతనమే అది! మరేకులందేనా ఒక్కరోజు కాదు, పదిరోజులు యువదానమిచ్చినా అలా కనిపెట్టలేదు.

నాగి: నానేటీ ఉలక్కుండా పలక్కుండా ఇలా కూచుంటాను, ఎలా కనిపెడతాదో సూత్తానుకాదూ!

నీలా: మీనడకతీరు, మొగమూ, సూసే కనిపెట్టొచ్చును. మీరుసిగ్గరో ఆరితేరినబాపతో!

నాగి: అబ్బోసి! అంతమాత్రాన్నే!

నీలా: రేపు ఎలాగయినా ఆకట్టుకాసులపేరు తెస్తేనే గాని మొగమే ఎత్తదు మా అమ్మాయి.

నాగి: ఏటో! ఇంకా రేపటిదాకా సెట్టినారు. ఇంకా ఈరాత్రంతా గడిసి తెల్లారితే రేపు!

నీలా: ఇంత తొందరపడేవారు మా అమ్మాయిని ఒక్కచణం తిండికేనా వదలరు కాబోలు!

నాగి: మరయితే పోతాను. పంతులుగారూ! వచ్చినపని వాకిట్లోనే అయింది.

గోపా: ఉండు. ఇతన్ని కాస్త దిగబెట్టి వస్తాను. తలుపు వేసుకో. (నాగిరెడ్డి గోపాలం వెళతారు.)

తెర.

ఓం

బ్రహ్మకృపాహికేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## నాలుగవరంగము.

---

సమయం. రాత్రి గం॥ 8 లు.

[శ్రీపురం. కృష్ణారావు ఇంటిగుమ్మం. అప్పన్న కేకవేసి పిలుస్తూ ఉంటాడు. అప్పన్న వయస్సు 40 సం॥లు హరిజనుడు, కృష్ణారావు తోటమాలి. కృష్ణారావు ప్రవేశం.]

కృష్ణా : ఏమిరోయ్ ! తోటమాలీ ! ఏమొచ్చావు రాత్రి పూట ?

అప్పన్న : రేపు సంకురేత్రి పండుగండి.

కృష్ణా : అవును. నాకు తెలుసును. నాకు పంచాంగం, తిథి వారనక్షత్రాలు చెప్పడానికి వచ్చావేమిటి ?

అప్పన్న : మా ఆడది నాలుగురోజులాయి జరంతో పడి పోయిందండి. పనిలోకెల్ల నేదండి.

కృష్ణా : అయితే మాఅమ్మాయిని మందు అడగడానికి వచ్చావా ? మ్యూన్సిపల్ ఆసుపత్రికి పో ! ఇంత క్వైనైను పోస్తారు.

అప్పన్న : నాలుగురోజులాయి ఇంట్లో కానిడబ్బు నేదండి. పిల్లోళ్ళంతా గోలగోల, ఇననేకుండున్నాం బావ్ !

కృష్ణా: డబ్బులేనివాడివి పిల్లలనెందుకు కనాలి? సంతాన నిరోధం నేర్చుకో! [ఇంట్లోనున్న వసంత నుద్దేశించి] అమ్మాయీ! తమలపాకులు లేనట్లున్నాయి. ఆవార్డుబాయ్ వస్తే పంపించి ఒక మోద తెప్పించు!

అప్పన్న: గంజినోకి ఉప్పు నేదని మాం ఏడుస్తుంటే తమడ పాకులు నేవని తఁవరు!

కృష్ణా: ఏమిట్రా! కళ్ళు నెత్తికొచ్చి పేలుతున్నావు?

అప్పన్న: నానేం తప్పుమాట సెలవియ్యనేదండి.

కృష్ణా: ఏడిశావు పో ఫో!

అప్పన్న: అమ్మబాబు! సంపేస్తారా! పండుగుపూట పెద్ద లకి బట్టలెట్టుకోవాలి. ఈయాళేం పారెయ్యరా?

కృష్ణా: బట్టలూ లేవు, పెద్దలూ లేరు. ఫో! డబ్బులేదని ఏడుస్తూ ఈవేషాలన్నీ ఎందుకు?

అప్పన్న: తమరు పప్పులూ, పాయసాలూ తింటే మాం విన్ని గంజి నీళ్ళేనా తాగొద్దాబావ్ [ఇంకా దగ్గరికి వస్తాడు.]

కృష్ణా: అయితే ఎవడి నడుగుతావు? ఇంకా మీదికి వస్తున్నావేమిటి?

అప్పన్న: తమరు గాందీగోరిశిశువులు. మాకులంవోళ్ళని బ్యామ్మలంతా అంటుకోవాలని నెక్చరు సెప్పినారంట.

కృష్ణా: కాంగ్రెసు వాళ్ళం గనక లెక్చరులో ఏదో చెబితే నిన్నువచ్చి ఇప్పుడు నెత్తిమీద ఎక్కమన్నానా ఏమిటి?

అప్పన్న: బ్యామ్మల నూతుల్లో నీళ్ళు అయినా తోడు

కొని ఆరి దేముడుగుళ్లోకి ఎల్లమన్నారంట. మాకులంవాళ్ళంతా తమరినే దేవుడిలా నమ్ముకున్నారు బావ్!

కృష్ణా : గాంధీవచ్చి మీకు కొమ్ములిచ్చాడ్రా! హరిజనులని పేరు పెట్టగానే మీకు కళ్లు నెత్తికొచ్చాయి.

అప్పన్న : అంతమాట మనివిసెయ్యకండి బావ్! తమరు బీదోళ్ళపాలిట దేవుడని మాకులంవోళ్ళంతా నిన్నే సెప్పుకుంతున్నారు. అందరికీ బూములు పంచిపెట్టిస్తారట్ట.

కృష్ణా : చూదాంలే! సామ్యవాదం అమలులోకొస్తే అలాగే చేదాం!

అప్పన్న : సిత్తం! రెండురూపాయలుపారేస్తే గుడ్డముక్క కొనుక్కొని......

కృష్ణా : రూపాయలిక్కడ దాచపెట్టావేమిట్రా! అవతలికి పొమ్మంటూంటే నీకు కాదూ! కాస్తచనువిస్తే నెత్తెక్కుతారు.

అప్పన్న : పండుగపూటా పస్తుండనా బావ్! గుడ్డముక్కనేకపోతే అదే పోనాది. ఓరూపాయి డబ్బులయినా పారేయించండి. నీగులాపోళ్ళు, సిన్నపిల్లలు, కడుపునిండా గంజేనా తాగుతారు.

కృష్ణా : నీగర్షణేవిట్రా ఇక్కడ నాకూ! ఫో! అవతలికిపో! దిగు! గుమ్మం దిగుముందు!

అప్పన్న : (దగ్గరకువచ్చి)సంపేస్తారా? ఒక్క అద్దరూపాయి డబ్బులయినా అప్పయినా ఇప్పిస్తే కాని సచ్చిపోతామే!

కృష్ణా : మీదికొచ్చి కాగలించుకుంటావేమిటి? వెధవ

మామిడితోట పూరా లేదు కాపూలేదు. ఈయేడైనా దానిమీాదఅప్పు తీరేవాటం కనబడదు. నీకుజీతం దండుగే కాకుండా పైగా అప్పుకూడానా? ఫో! అవతలికి!

అప్పన్న : నువ్వు సంపేసినా సరేకాని, ఇయాళ ఏమైనా పారేస్తే కాని ఇంటికెళ్ళనేనే! (కృష్ణారావుకాళ్లు పట్టుకుంటాడు)

కృష్ణా : [కాలితో తోసెయ్యగా అప్పన్న వెనక్కిపడతాడు] వెధవకుళ్లుచేతులు నువ్వు పోతావా పోవా! [అప్పన్న దీనంగా చూస్తూ ఉండిపోతాడు]అయినపని ఎలాగాఅయింది! లే! లేవవేం! (అప్పన్నని చెయ్యిపట్టుకొని ఈడ్చేస్తూ) చచ్చిన గేదెపెయ్యలాగ ఎంతబరువున్నావురా! గెటౌట్! రేపటినుంచి తోట్లో పని చెయ్యొద్దు. నిన్ను డిస్మిస్ చేస్తున్నాను. తెల్లవారేసరికి నువ్వు తోట్లో కనబడితే చంపేస్తాను.

(కొడుతూ పైకి తగిలేస్తాడు.)

తెర



ఓం

బ్రిహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఐదవరంగము.



సమయం. ఉదయం గం॥ 7 లు.

శ్రీపురంవీధి. [వాసు, కొందరు రైతులు పాడుతూప్రవేశం. వాసు: ఖద్దరుచొక్కా, ఖద్దరుపంచ, కుంకుమబొట్టు, ఒకచేతిలో ఆంధ్రపతాకము, రెండవచేతితో ఖద్దరుసంచి, ఆంధ్రరాష్ట్రపటం]

పాట.

మనజాతి, మనభాష, మనదేశమనిజిహ్వ
అభిమానమునపల్క నాశింపుడీ!
సోదరుల్, ఆంధ్రజననికి ముక్తితెండీ,
సోదరుల్, ఆంధ్రజననికి ముక్తితెండీ॥
తల్లివెన్నెముక యాపల్లెటూరేసుడీ
ఎల్లశక్తులు తల్లికై, ధారపోయుడీ॥

[వెళతారు]

---

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఆఅవరంగము.



సమయం. ఉదయము గం॥ 9 లు.

[కృష్ణారావు ఇల్లు. వసంత నీటుగా తయారయి ఒకచీటి చదువుతూ ఉండగా కృష్ణారావు ప్రవేశం]

కృష్ణా : ఎవరమ్మా ఉత్తరం ?

వసంత : ఇవాళ వాసు ఊళ్ళోకి వచ్చాడు. మీరు చూశారా ?

కృష్ణా : లేదమ్మా !

వసంత : మనిషి ఎలాగ మారిపోయాడనుకున్నారు! అంతా ఖద్దరు. వాడి వడపోసిన దేశసేవకుడిలాగున్నాడు. తానూ, వెనకాతల పదిమంది రైతులూ పాటలు పాడుకుంటూ పొద్దుటే ఇలా వెళుతూంటే చూశాను.

కృష్ణా : వాసుకాడేమో !

వసంత : బాగుంది. వాసుని పోల్చుకోలేనా? ఇలా ఎలా మారిపోయాడు నాన్నగారూ ?

కృష్ణా : కర్మవీరునితో సంచారానికి వెళ్ళాడని మాత్రమే విన్నాం! మరి ఈరైతుల గొడవేమిటో !

వసంత : అతన్ని రమ్మని కబురంపాను. వస్తున్నానని ఈ చీటీ పంపాడు. మీరుకూడా ఉంటారు కాదూ! మన ప్రయత్నం విషయంలో అతని అభిప్రాయం ఏమిటో ఈవాళ స్పష్టంగా తేల్చుకోవాలి.

కృష్ణా : ఆవిషయం నువ్వుమాట్లాడితే నే తేలుతుంది. నాకు మనస్సుకూడా ఏమీ స్థిమితంగాలేదు.

వసంత : ఏమీ?

కృష్ణా : ఆమాల వెధవ తోటమాలీవాడు నిన్నరాత్రి వచ్చాడు కాదూ! ప్రాణాలు తిన్నాడు. ఇవాళ ఉదయం తోటలోకి వెళ్ళి చూదును గదా! తోటంతా నానాపాడూ చేశాడు. ఒళ్ళుమండుకొచ్చి వాణ్ణి చిదక గొట్టాను. వాసు నలుగురిల్లో ఏమి అల్లరి చేస్తాడో అని దిగులుగా ఉంది.

వసంత: వాసు వస్తున్నాడు.

వాసు : [ఖద్దరుపంచ, ఖద్దరులాల్చీ, చేతిలో ఆంధ్రరాష్ట్ర దేశ పటంతో ప్రవేశించి] ఆంధ్రమాతకు జే!

కృష్ణా : స్వాగతం! ఇదేమిటి శ్రీ వాసుదేవరావుగారు దేశభక్తులుగా మారిపోయారు!

వాసు : ఏమీ నాకు హక్కు లేదా?

కృష్ణా : కావలసినంత హక్కు ఉంది. అందుకే 'స్వాగతం' అన్నాను.

వాసు : వసంత నాకు స్వాగతం ఇయ్యలేదు!

వసంత : (లేచి) వాసుకి స్వాగతం! నువ్వెంత దేశభక్తుడివైనా నామట్టుకు వాసువే!

కృష్ణా: ఇంతకాలం ఎక్కడ? ఏమ్మాత్రం సంచారం జరిగింది? ఏడెనిమిది నెలల పాటు ఏకాగ్రంగా ఒకటే దీక్ష పట్టినట్లుందే!

వాసు: ఇదిగో నాసంచారప్రదేశం. (ఆంధ్రరాష్ట్రపటం విప్పి చూపిస్తూ)

సీ॥ రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కన కత్తికడిగిన కదనభూమి,
అమృతాక్షరవికాసమయిన ఆ సుకవి పో
తన లేఖిని ప్రశాంతి గనిన చోటు
భాషాకుమారి కబ్రపుపెండ్లి యిల్లైన
కృష్ణరాజ్యము వెలింగిన తలమ్ము
నానావిదేశ నౌకానీక విపులాశ్ర
యంబైన రేవు రూపరిన తావు
పాడయి, శిలావశిష్టమై పాత్రకాల
మనుభవించుచునుండియు నక్కటకట
బ్రతికిచెడ్డ ఆంధ్రుల పూర్వవైభవంబు
చాట నాలించినాడ విచారమొదవ॥ [రాయప్రోలు]

దానిఫలితంగా త్రికరణశుద్ధిగా ఆంధ్రసేవాదీక్షను పూనాను.

కృష్ణా: మరేం! ఇప్పుడు పదహారణాల ఆంధ్రుడవన్న మాట! నీకార్యక్రమం?

వాసు: గ్రామపునర్నిర్మాణం!

కృష్ణా: అదేమిటి? ఆంధ్రోద్యమంలో గ్రామపునర్నిర్మాణం మిళావు చేశావన్నమాట!

వాసు : నాప్రణాళిక సావకాశంగా వింటారా ? ఒకనాడు పాటలీపుత్రం మొదలు సేతువువరకు వ్యాపించిన ఆంధ్రుల రాజ్యం చీలికలు పేలికలు అయి అంతరించింది. ఆంధ్రుడయిన చంద్రగిరిరాజు ఆంధ్రుల చెన్నపట్నాన్ని ఆంగ్లేయుల కప్పగించినదినం ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి దౌర్భాగ్యదినం. నాటితో ఆంధ్రకుటుంబం ఛిన్నాభిన్నమయింది. ఆంధ్రుల విజ్ఞానం, తేజస్సు, ఐక్యత, అర్థికసంపత్తి అన్నీ అడుగంట నారంభించాయి. ఆంధ్రులవ్యక్తిత్వం, జాతీయత, ఆదర్శం అన్నీ నశించాయి.

కృష్ణా : కనుక, కాబట్టి, ఆంధ్రరాష్ట్రం విడదీసి, సరిహద్దు లేర్పాటుచేసి, ప్రత్యేకం, గవర్నర్ని, హైకోర్టు, మరికొన్ని కాలేజీలు, శాసనసభ, ఆంధ్రులకి ఉద్యోగాలు ప్రసాదించాలంటావు. అంతేనా నీప్రణాళిక ?

వాసు : అంతేకాదు. ఆప్రకారం ఆంధ్రరాష్ట్రం విడదీయడంవల్ల ఆంధ్రులధనం ఆంధ్రులకే వినియోగమవుతుంది. ఆంధ్రుల శక్తిసామర్థ్యాలు వృద్ధికాడానికి అధికారం తోడ్పడుతుంది. కాని నాదృష్టిలో అదొకవిశేషంకాదు. ఆంధ్రోద్యమానికి పరమావధి ఉద్యోగలబ్ధియే కాదు. ఆంధ్రతత్వం పూర్తిగా వికసించాలంటే, ఆంధ్రుల విజ్ఞానం, సంస్కృతి పెంపొందాలంటే, ఆంధ్రరాష్ట్రంలో ఉన్న గ్రామాలన్నింటిని పునరుద్ధరించాలి. ఆంధ్రులుస్వయంసహాయంమీద పూర్తిగా ఆధారపడాలి.ఏగ్రామానికాగ్రామం స్వయంపోషకంకావాలి.

నూటికి ఎనభై మందిగా ఉన్న రైతుకులాన్ని ఉద్ధరించే ప్రణాళికే లేకపోతే, ఆంధ్రుల గ్రామాలలో స్వతంత్రతా దేవికి ఆలయాలే కట్టలేకపోతే, ఆంధ్రరాష్ట్రమే కాదు, ఆంధ్రులకు సర్వస్వతంత్రంవచ్చినా అది అంతప్రయోజనకారి కాదు.

వసంత : చాలా గొడవ తెచ్చావే! అయితే ఇన్నాళ్ళూ నువ్వెక్కడున్నట్లూ ?

వాసు : మూడుమాసాలపాటు, అమరావతీ, హంపీ, ధాన్యకటకం, లేపాక్షీ, మొదలయిన ఆంధ్రుల పూర్వౌన్నత్యాన్ని చాటే దివ్యస్థలాలన్నీ దర్శించాను. సంచారంనుండి తిరిగివచ్చిన ఈఅయిదారు నెలలనుండీ నాప్రణాళిక అమలు పరుస్తున్నాను.

కృష్ణా : నీప్రణాళిక అప్పుడే అమలులోకే వచ్చిందీ ?

వాసు : ఆ! ఇక్కడే పదిమైళ్ళలో భాగ్యవరం అని మాదొక గ్రామం ఉంది. దానిని సర్వవిధాలా ఆదర్శమైన గ్రామం చేయడానికి పూనుకొన్నాను. కొత్తపద్ధతుల్లో వ్యవసాయం సాగిస్తున్నాను. రకరకాల చేతిపనులు తయారవుతున్నాయి. గ్రామపరిశ్రమలన్నీ అభివృద్ధి అవుతున్నాయి.

కృష్ణా : అయితే మిల్లులన్నీ కట్టివేస్తున్నారా ?

వాసు : ఇప్పుడు మానాన్నగారికీ నాకూ అదే తగువు. మానూనెమరలు, బియ్యపుమరలు మూసివేయమనే పట్టుబడుతున్నాను.

కృష్ణా : అక్కడే పప్పులో కాలువేస్తున్నావు. ఫాక్టరీలు మూసేస్తే వందలకొద్దీ కూలీలకి నిర్వ్యాపకంకాదూ! ప్రతీ

దేశమూ యంత్రాలల్లో మునిగి తేలుతూంటే, మీ గ్రామ సంఘాలవారు బయలుదేరి అసలు యంత్రాలే వద్దంటారే మిటి? వాళ్ళంతా విమానాలమీద అంతరిక్షానికి ఎగిరి పోతూంటే మనం కుమ్మరిపురుగుల్లాగ దొలుచుకొని దొలుచుకొని పాతాళం అడుగుచూస్తున్నాం.

వాసు: గ్రామ సంఘాల ఉద్దేశాలు మీరు పూర్తిగా గ్రహించలేదు. యంత్రాలన్నీ మూసివేసి పల్లెటూళ్ళని కార్ఖానాల క్రింద తయారుచెయ్యడం మా ఉద్దేశం ఎన్నటికీ కాదు. గ్రామస్థులు చేతితో చేయగల పనుల కెన్నటికీ యంత్రాలు వాడకూడదు. యంత్రమనేది మనిషికి సహాయకారిగా ఉండాలికాని, మనిషి యంత్రానికి దాసుడు కాగూడదు. ఏభయియేళ్ళ క్రిందట గ్రామస్థులల్లో ఉండే చురుకుదనం, తెలివి తేటలు ఇప్పుడు లేవు చూశారా?

కృష్ణా: ఏమయి పోయాయంటావు?

వాసు: గ్రామస్థులల్లో ఏమాత్రమయినా బొత్తి శుద్ధి ఉన్నవాడిప్పుడు పట్నం చేరిపోతున్నాడు. సుఖం మరుగుతున్నాడు. ఏ ఉద్యోగమో చేసుకొని పింఛను పుచ్చుకున్నా కయినా తిరిగీ తన గ్రామం చేరుకొని దానిని బాగుచేదామనే అభిమానం లేదు.

కృష్ణా: లేకేమి లే! ఇప్పుడు కొందరు మహాపురుషులు బయలుదేరి గ్రామాలల్లో పంచదార ఫాక్టరీలు పెట్టిస్తున్నారు కాదూ!

వాసు: మరేం! అక్కడికావృత్తి పడగొట్టి రైతును మూలమట్టం చేయడానికి! బెల్లంపండించి ఎన్నో కుటుంబాలు బ్రతకకుండా పన్నిచ్చుకుంటూ పంచదారెందుకూ మనకి? ఇలాగే ఒక్కొక్క వృత్తే మనగ్రామస్తులు మరిచిపోతే మీరన్నట్లు పాతాళమేగతి.

కృష్ణా: అయితే, నాగరిక ప్రపంచమంతా కొత్తకొత్త సాధనాలు కనిపెట్టి, వాయువేగమనోవేగంతో ముందుకుసాగుతూంటే, మనం ఒక్కొక్కశతాబ్దమే వెనక్కిపోయి ఇక్ష్వాకులలో చేరిపోవాలంటావేమిటయ్యా?

వాసు: దేశంలో ఎన్నిపరిశ్రమలు నశించాయో మీరేమైనా చూశారా? నీలిమందు పరిశ్రమ పోయిందా? కమ్మరివాళ్ళ పరిశ్రమ చచ్చిందా? బిందెలుచేసే కమ్మరి జర్మనీ ఇత్తడిరేకు కొంటున్నాడా? లక్కపరిశ్రమలు, లక్కగాజులు పోయి గాజుముక్కలు వచ్చాయా? కొండపల్లి బొమ్మలు, నక్కపల్లి లక్కసామానుకీ బదులుగా జపానుబొమ్మలు బొమ్మలకొలువుల్లోసింహాసనాల లంకరిస్తున్నాయా? తివాసీనేత అడుగంటిందా! అజంతాచిత్రాలకి వేసిన రంగులపాళ్ళు ఏదొరకనుక్కోగలడో అడగండి! చివరకి ఆడదానికి కుంకం తయారుచేసుకోడం చేతగాక తిలకం విసర్జించడం నాగరికతకి చిహ్నమైంది.

కృష్ణా: మొత్తంమీద యంత్రాలు కూడా వృద్ధికావాలని అంగీకరిస్తావా?

వాసు : ఆహా! వేలకొలదీ ప్రజల జీవనం పడగొట్టే యం త్రాలు తప్ప తక్కినవన్నీ వృద్ధికావలసినదే! అచ్చుయం త్రాలుండాలి. వసంతకి శస్త్రసామగ్రితయారుచేసే యంత్రా లుండాలి. మనచేతులతో తయారుకాని అత్యవసరమయిన వస్తువులకన్నిటికీ యంత్రాలు ఆవశ్యకమే! బట్టలమరలు, నూనెమరలు, ధాన్యపుమరలు ఎంతమాత్రమూ ఉండకూడదు.

కృష్ణా : ఇప్పుడింకేమీ ఫర్వా లేదోయి! ప్రభుత్వమే పూనుకొన్నారు గ్రామపునర్నిర్మాణానికి.

వాసు : అది వట్టి కళ్ళతుడుపు సానుభూతి. నిజంగా ప్రభుత్వానికే గ్రామాభిమానం ఉంటే ప్రతీప్రభుత్వపు ఉద్యోగికీ పింఛను యిచ్చేటప్పుడు గ్రామాల్లో నివసించే షరతుమీద ఇవ్వాలి. జడ్జీలు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, ఇంజనీర్లు పింఛను తీసికొని గ్రామాల్లో నివసిస్తే వారికా వృద్ధాప్యంలో సుఖమైన గ్రామజీవనం, గ్రామకళ్యాణానికా ఒక సోపానం.

కృష్ణా : చాలా గొప్ప ఆలోచనే చేశావు.

వాసు : పోనీ గ్రామస్థులయినా ఉన్న భూములల్లో పంట వృద్ధిఅయే శాస్త్రీయమైన పద్ధతులు నేర్చుకోరు కదా? ఇంకా మనదేశానికి జావానుండి చక్కెర, ఆస్ట్రేలియానుండి గోధుమలు, సయాంనుండి బియ్యమూ దిగుమతి కావాలా? జావాలో ఎకరానికి 65 టన్నుల చెరుకు పండుతూంటే మన దేశంలో ఎకరానికి 35 టన్నులా? జపానులో ఎకరానికి 150

రూపాయల రాబడి అయితే మనదేశంలో ఎకరానికి 25 రూపాయల ఆదాయమా?

కృష్ణా : ఏంచెయ్యమన్నావు? దరిద్రం! రైతుకి భూవసతి లేదు. సాధనసంపత్తి లేదు. యంత్రసామగ్రిలేదు.

వాసు : సోమరితనం పోయే యంత్రమేదైనా కనిపెడితే దరిద్రం వదలిపోను. ఈబియ్యేలు, ఎమ్మేలూ, పాసయి గోళ్లు మీటుకుంటూ కూచునే నాయనమ్మలు గ్రామాల్లోకి రాకూడదూ?

కృష్ణా : వస్తేమాత్రం వీళ్ళేం నాగలిపట్టుకోవాలా, గొప్పు తవ్వాలా, కలుపు తియ్యాలా?

వాసు : పోకులు, సరదాలు వదలిపోయి, శరీరకష్టం నీచమనే అభిప్రాయం పోతే అన్నిపనులూ చేస్తారు. పోనీండి! చదువుకొన్న ప్రతీమనిషి తనతోటివాళ్ళకి పదిమందికి చదువు చెప్పడానికి కంకణం కట్టుకొంటే ఒక్క ఏడాదిలో దేశంలో నిరక్షరత్వమంతా నశించిపోదూ?

కృష్ణా : సరే! నీప్రణాళిక బాగానే ఉంది కాని, గుండు సూది మొదలు మరఫిరంగీ వరకు చిత్రవిచిత్రమైన వస్తువులు గుట్టలుగుట్టలుగా యంత్రసహాయం వల్ల తయారయి అతి చవకగా లభిస్తూంటే, గ్రామాల్లో తయారయిన నీ మోటు వస్తువులకి చలామణీ ఎలాగ?

వాసు : అక్కడే దేశభక్తికీ త్యాగానికీ కార్యక్షేత్రం. అతిసన్నని విదేశీవస్త్రాలు అతి చవకగా లభిస్తూంటే మీరు

మోటుఖద్దరు ధరించలేదూ? కేవలం, కాంగ్రెసులో పదవికి అర్హత కోసమే కడుతున్నారా? దానిలో త్యాగం లేదూ? దేశాభిమానం లేదూ? అలాగే ప్రతిఆంధ్రుడూ ఆంధ్రదేశపు వస్తువులని ప్రోత్సహించాలి. ఆంధ్రదేశంలో తయారయిన ఏవస్తువయినా ఎంతమోటుగా ఉన్నా ప్రాణప్రదంగా అభిమానించాలి. ఇది నా ఆంధ్రసోదరుని పరిశ్రమ; దీనికి వెలయిచ్చి పోషించాలి; అనే అభిమానం రగుల్కోవాలి. ఆంధ్రదేశపు వస్తువుండగా, ఆంధ్రేతరవస్తువు వాడేవాడికి ఆంధ్రుడనిపించుకోడానికి అర్హతలేదు. ఆంధ్రరాష్ట్రపు ఎల్లలు దాటిన ప్రదేశమంతా మనకి పరదేశం క్రిందే లెఖ్ఖ.

కృష్ణా: ఏమిటీ! గుజరాతు మాంచెస్టరు ఒకటే అంటావా? నీదృష్టిలో?

వాసు: రమారమీ అంతే!

కృష్ణా: [ఆవేశంతో] హిందూదేశం అవిభాజ్యమనీ, ఆంధ్రమాత భరతమాతకి పుత్రికనీ నువ్వంగీకరించవన్నమాట! పొరబడుతున్నావుసుమా! ఒక్కసారి సింహావలోకనంచేసుకో! ఆంధ్రులు పూజించే రాముడు కృష్ణుడూ ఆంధ్రులా? ఆంధ్రులు సేవించే కాశీరామేశ్వరాలు ఆంధ్రప్రాంతాలా? ఆంధ్రభాషకి తల్లిభాషయిన సంస్కృతం ఒక్క ఆంధ్రులసొత్తా? సంస్కృతంలో ఆదికావ్యాలు వ్రాసిన మహాకవులు ఆంధ్రదేశీయులా? దేశమంతా నిండిఉన్న హిందూమతం కేవలం ఆంధ్రులదేనా? నీ ఆంధ్రరాష్ట్రోద్యమం వంగీయుల వందే

మాతర ఉద్యమానికి అనుకరణం కాదూ? పొరపడకు! భారతదేశం అంతా ఒక్కటి; అవిభాజ్యం; భారతీయులంతా ఏకోదరులు. సహోదరు లెవరికుంటాలు వారు చక్క బెట్టుకోవలసిందే! తల్లిని కనిపెట్టే విషయంలో అందరూ ఏకీ భవించాలి. పొరపడకు. ముందు భారతీయుడవు తరువాత ఆంధ్రుడవు అనుకో.

వాసు: (ఆలోచనాయత్తుడై ఉంటాడు)

వసంత: నేనేదో పనుండి వాసుకి కబురంపిస్తే మీరీవా దానికి దిగేరేమిటి? నాన్నగారూ! మీకు వేళయిందిభోజనం చేసిరండి!

కృష్ణా: వాసూ! నువ్వుకూడా లేవవోయి భోజనానికి.

వాసు: క్షమించాలి. మా రైతుసోదరులంతా మాయింటి వద్ద కనిపెట్టుకొని ఉన్నారు. మానాన్నగారితో మాట్లాడి మళ్ళా కొంతసొమ్ము తీసుకొని పోవాలని వచ్చాను. మేనే జరుగారికి కబురుకూడా పంపాను.

కృష్ణా: సరే! వసంత ఏదో మాట్లాడుతానంటూంది కాస్త సేపు ఉంటావుకాదూ?

[కృష్ణారావు ఇంట్లోకివెళతాడు. వసంత విచారగ్రస్తురాలై ఉంటుంది]

వాసు: వసంతా ఎందుకూ? దుఃఖమెందుకూ?

వసంత: నువ్విలాగు పాడై పోయాక దుఃఖంకాక ఏముంది!

వాసు: [చిరునవ్వుతో] పాడై పోయానంటావా? మహత్తర మైన దేశసేవకి నాజీవితం అర్పించాను. ఈసేవాపారథం ఉత్తమ

పథంపట్టింది. ఆరథానికి నాజీవితంఒకచక్రం నీజీవితమొకచక్రం. నాజీవితచక్రం బిగించాను. నీజీవితచక్రాన్నికూడా అమర్చగలిగితే రథం చకచకా నడుస్తుంది!

వసంత : మనం ప్రతిరోజూ ఖులాసాగా కలుసుకుంటూ ఉంటామనీ ఊసుపోతుందనీ అనుకొన్నాను.

వాసు : చక్కా మాభాగ్యవరంవస్తే కావలసినంత కాలక్షేపం. ఆరైతులు వాళ్ళజీవనం, ఆ అమాయికత్వం, అజ్ఞానం, ఓహో! చేసినకొద్దీ తరగని పనుంది.

వసం : మహారాజా అని మనవి చేసుకుంటే మరొకటి తన్నమన్నాడట. నువ్వు అగ్రికల్చరిస్టువి కనుక నీకదిసరదా కాని, నావైద్యశాస్త్రమంతా అక్కడేం చెయ్యను?

వాసు : పల్లెటూళ్లలో ఎంతఅనారోగ్యం, ఎంతకుళ్లు! వాటినన్నిటినీ ఆరోగ్యమయిన గ్రామాలు చేయవచ్చును. ఆప్రజల ఆరోగ్యరక్షణకు తోడ్పడవచ్చును.

వసం : చూస్తూఉండగా నీకింత పల్లెటూరిపిచ్చి పట్టుకుందేం? ఆసూట్లూ, హేట్లూ, ఫాషన్లూ ఎక్కడికి పోయాయి? నవమన్మథుడిలాగు ముద్దొస్తూఉండే అందమంతా ఎక్కడికి పోయింది? కూలివాడిలాగా రైతువాడిలాగా ఆపాటలు, వేషం, నాకేంనచ్చలేదు సుమీ!

వాసు : ఆజీవనంలో నీకు రుచి తగలలేదు. పల్లెటూరంటే స్వర్గం. ఆప్రకృతిసౌందర్యం ఎంత మనోరంజకంగా ఉంటుంది. అక్కడి ప్రజలజీవనం వాళ్ళదరిద్రమూ చూస్తే మాత్రం కళ్ళంట రక్తపు చుక్కలు కారుతాయి. హృదయం బరువెక్కి పోతుంది.

వసంత : మన అమెరికాప్రయాణం ?

వాసు : అది వెనకపడ్డట్టే !

వసంత : అబ్బా ! ఇంకనిన్ను విలేజికి వెళ్ళనివ్వను. [వాసు చెయ్యిపట్టుకొని] నాకిక్కడేమీ తోచలేదు సుమీ ! ఊళ్లో అంతా ఏమనుకుంటున్నారో విన్నావా ? మన ఇద్దరికీ మారేజి అయిపోయిందనే ఊళ్ళో రూమరు !

వాసు : పిచ్చిప్రపంచం !

వసంత : నువ్వింక ఏమనుకొన్నా వెళ్ళనివ్వను. నువ్వు, నావాసువి. నువ్వు పల్లెటూళ్ళో కూర్చుంటే నేనిక్కడ బ్రతకడమెలాగ ? నేను వదలను. ఎలా వెళతావో చూస్తాను కాదూ ! (వాసుచేయి పట్టుకుంటుంది)

వాసు : అందుకే రాకూడదూ అక్కడికి ? గ్రామనిర్మాణ కార్యక్రమంలో నాకు చేదోడు వాదోడుగా నీవంటి విజ్ఞానవంతురాలుంటే నాకెంత ఉత్సాహంగా ఉంటుంది !

శా॥ బాలార్కప్రభసోక నంబుజములున్ బాలేందుచే గల్వలే
లీలన్ బూర్ణవికాసముఁ గని జగచ్ఛ్రీయంబు గావించు నా
లీలన్ దావకపాణిసంఘటితసుశ్రీలిచ్చి, ఈజన్మ లాం
ఛ్రాలీ సేవకె యర్పితంబుగ నొనర్పంజెల్లదే ! నెచ్చెలీ ॥

[జాలిగా] మాగ్రామం వస్తావా ?

వసంత : [పెదమొగంపెట్టి] నేనా ! జన్మలో రాను.

వాసు : అయితే రథం ఒంటిచక్రంతో నడవవలసిందే ?

వసంత : ఏమంత ఖర్మం వచ్చింది ? హాయిగా మహాసౌఖ్యం అనుభవించడానికి పెట్టిపుట్టినన్ని, సుఖాన్ని ఉన్న

ప్రాణం దుఃఖాన్ని పెట్టుకోమని ఎవడు చెప్పాడు? ఆపిచ్చి పాటలు పాడుకుంటూ, ఈవేషంతో ఊరంతా తిరుగుతూంటే నాకు చాలా కష్టంగా ఉంది చూడడానికి !

వాసు : ఏఁవిటో అభిప్రాయభేదం ! ఎవడివెఱ్ఱి వాడి కానందం.

వసంత : నువ్వు మరివెళ్ళొద్దు!

వాసు : అది నాజీవితం !

వసంత : నేనెంతచెప్పినా తృణీకారమే ? నన్నువిడచి వెళ్లి పోతానంటావు, నిన్ను నేనెలాగ విడచిపెట్టగలనూ ! ఎలాగు మరచిపోగలనూ !

వాసు : ఇదిగో ! నాకతిప్రియమైనవస్తువు. నాజ్ఞాపకార్థం ఉంచుకో ! [కొయ్యదువ్వెనతీసి ఇస్తాడు]

వసంత : ఇదేమిటి ?

వాసు : కొయ్యదువ్వెన. విలక్షణమయిన కాంతులు ప్రసరించే నీమృదువైన నీలాలకలు దీనిసంపర్కంచేత మరింత శోభిస్తాయి.

వసంత : ఛీ ! నాఖర్మం కాలిందా ఏమిటి ? కొయ్యదువ్వె నట ! వీధిలో ముష్టెత్తుకొనే ముండకూడా ఇలాటిదువ్వెనతో దువ్వుకోదు. [దువ్వెన విసరివేస్తూ] నీమీాద ఇంత ఆశపెట్టు కొన్నందుకు తగిన శాస్తిచేశావు. మాంచిగౌరవం చేశావు. ఇంత నికృష్టంగా చూసి అవమానిస్తావనుకోలేదు.

వాసు : నీ అజ్ఞానంచూసి జాలిపడడంతప్ప నేనేం చెయ్యి

గలను! ఈదువ్వెన నాకు ప్రాణపదం. [దువ్వెన ఆప్యాయంగా తీసుకొని] మరి వెళతాను.

వసంత: కోపం వచ్చింది కాబోలు. వెధవ దువ్వెన నీకు ప్రాణపదమా? నాకంటే ప్రాణపదమా?

వాసు: (వసంత బల్లమీదనున్న విదేశీదువ్వెన తీసి దానిని కొయ్య దువ్వెనను రెండుచేతుల్లో పట్టుకొని పరకాయిస్తూ)

గీ॥ ఆంధ్రులధనంబు హరియించు నన్యదేశి
వస్తు వెంతటి నవరత్నభరితమైన,
ఆంధ్రకార్మికసోదరహస్తనిర్మి
తంబయిన కొయ్యదువ్వెన దరి తృణంబు ॥

(విదేశీదువ్వెనను వసంతబల్లమీదికి నిర్లక్ష్యంగా విసరివేసి, తన ఆంధ్రరాష్ట్రపటం తీసుకొని వాసు వెళతాడు. వసంత నిర్విణ్ణురాలై చూస్తూ ఉండిపోతుంది)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఏడవరంగము.



శ్రీపురంలో వీధి, సమయము ఉ॥ గం॥ 10-30 లు.

(వసంత ఇంటినుండి వాసు తిరిగి వెళుతూండగా రామం ఎదురుగా వస్తాడు)

వాసు : గోపాలంగారు ఊళ్ళో ఉన్నారేమో కనుక్కున్నావా ?

రామ : ఉన్నారు. రేపు ఉదయం వారు భాగ్యవరం వచ్చి, ఇదివరకు పెట్టిన ఖర్చుకు ఎంతపని జరిగిందో తనిఖీ చేస్తారట.

వాసు : నాన్నగారితని చేతిలో వట్టికీలుబొమ్మ అయిపోయారు. సరే ! నువ్వింత ఆలస్యం చేశావేమీ ?

రామం : చాలా సేపయింది బయలుదేరి. దారిలో వెంకి కనబడి గోల పెట్టింది.

వాసు : ఏ వెంకి ?

రామం : మనమిల్లులో పని చేస్తూంది. ఆమె పెనిమిటి ఎక్కడో తోటమాలీగా ఉన్నాడట. ఆ తోటయజమాని అతన్ని చావకొట్టేడట. మంచంపట్టి లేవలేకుండా ఉన్నాడు. అతని పనికూడా తీసేశారు. దానిగోల వింటూంటే ఆలస్యమయింది.

వాసు: దేశంలో బీదవాళ్ళకు దిక్కూ—మొక్కూ— లేదు. ఇదే ధనికుడయితే వెంటనే సర్టిఫికేటుతీసి ఫిర్యాదుచేస్తాడు.

రామం: ఆమెగోల వింటూంటే మహాకష్టమనిపించింది. నేనేమి చెయ్యడానికీ అసమర్థుణ్ణి. ఆమె పెనిమిటి దెబ్బలు కూడా చూశాను. ఒళ్ళంతా కమిలిపోయి గాయాలు. ఆ మహానుభావుడెవరోకాని గొడ్డును బాదినట్టు బాదాడు. తమరు పూనుకొని సహాయం చెయ్యడం చాలా అవసరం.

వాసు: సరే! ఈరాత్రివరకూ ఉంటూంకాదూ! సాయంత్రం డాక్టరు వసంతాబాయిని తీసుకొని వెళ్ళి చూపించుదాం. చికిత్సా చేయించవచ్చును. సర్టిఫికెటు తీసుకొని కేసూ పెట్టించవచ్చును. రా! పోదాం.

[వెళతారు]

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఎనిమిదవ రంగము.

---

పగటి వేళ.

కర్మ: (వీధిసీను-కర్మవీరుని సంచారము.)

పాట: మతభేదంబుల-స్థితిభేదంబుల
గతమని మరచి-కన్నతల్లికై
అతులితమగు జీ-వితమర్పించి
ఆంధ్రరాష్ట్రమే-ఆశయమనరా॥ ఆంధ్రమాతృ

సీ॥ మగధసామ్రాజ్యసీమలు నీసితచ్ఛత్ర
ముక్తాఫలచ్ఛాయ మునుగునాడు,
అలకళింగోపాంత మందు నీకంఖాణ
ఖురధూళి నెఱసందె గురియునాడు,
కర్ణాటరాజ్యరంగముల నీకవులను
బ్రహ్మరథంబులు పట్టునాడు,
తంజాపురోద్యానకుంజమ్ములందు నీ
సంగీతమధుధార పొంగునాడు,
అతిభయంకరశౌర్యధైర్యప్రసక్తి
రసవశంకరనాగరరాగశక్తి
ఏకమై, పాకమై, ప్రవహించినట్టి
ఆయఖండప్రభావ మేమాయెనమ్మ॥ [రాయప్రోలు]

[వెళతాడు]

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## తొమ్మిదవ రంగము.



సమయం సా॥ గం॥ 5-30 ని.

(శ్రీపురం ఊరిబయట తోటమాలి అప్పన్న ఇంటి సమీపం, మోటారు చప్పుడు. వసంత, వాసు రామం-ప్రవేశం.)

వసం: వాసూ! పొద్దల్లాపోయి చీకటి పడుతూంటే ఇప్పుడెక్కడికింకా ఇలా తీసుకుపోతున్నావు?

వాసు: రామం! ఎక్కడుందోయి, అతని ఇల్లు?

రామం: దగ్గరకు వచ్చాశాం. నేను వెళ్ళి చూసి వస్తాను. తమరిక్కడే ఉండండి.

వాసు: సరే! వెళ్ళి వేగంరా! (రామం వెళతాడు)

వసంత: పిల్లిని చంకపెట్టుకొన్నట్లు ఇతను కూడా ఉండాలేమిటి ఎక్కడబడితే అక్కడ?

వాసు: అతనిమీద నీకెందుకంత ఆగ్రహం?

వసంత: అదేమిటో! నాకంటికతడు డీసెంటుగా కనబడడు. అతనికి మాటనేర్పుకూడా ఉన్నట్లు కనబడదేం? నిర్లక్ష్యం పెంకితనం కావలసినంత!

వాసు: అతన్ని గురించి నీ అభిప్రాయం మార్చుకోవాలి. మానవసేవ అతనికి ఉగ్గుపాలతో పట్టారు.

వసంత : ఇతడు నీకు బ్రదర్నంటాడేమిటి ?

వాసు : ఇతన్ని నేను సోదరునికంటె హెచ్చుగా చూస్తాను. మాఅమ్మపోయినతరువాత ఇతనితల్లే నన్ను పెంచింది. ఆమె చనిపోయేటప్పుడు ఇతన్ని నాచేతుల్లో పెట్టి అప్పగించింది. సేవాదీక్షలో ఆంజనేయుడితనికి తీసికట్టు.

వసంత : నీదగ్గిర అతివినయంగా ఉంటాడు గనుక! అయినా అతనికంత చనువిచ్చి నెత్తిమీద పెట్టుకుంటావేం? రాకరాక రానేవచ్చాంగదా! హాయిగా మనమిద్దరం చల్లగాలిలో తిరగకుండా, ఈకాస్తసేపైనా అతడు లేకుండా ఉండలేవు కాబోలు.

వాసు : అడుగో! అతడు మెల్లిగా లాంతరు పట్టుకొని వస్తున్నాడు.

వసంత : వస్తున్నాడూ ? అప్పుడే! నావేపు చూడూ !

(వాసుభుజంమీద చెయ్యివేస్తుంది. వాసు తప్పించుకొని "రామం!" అని కేకవేస్తాడు)

వసంత : ఇంతేకాదూ ? నీగుణం చూస్తున్నానులే !

రామం : (ఒక గుడ్డిలాంతరుతో ప్రవేశించి) అతడే వస్తున్నాడు.

వాసు : మంచంమీదనుంచి లేవలేనిస్థితిలో ఎందుకు వస్తున్నాడు ?

రామం : ఎంతచెప్పినా వినలేదు. బాబుగారి సిక్కడకి శ్రమపెడతానా అని తనే మెల్లిగా దేకుకుంటూ వస్తున్నాడు.

వసంత : అసలు కేసేమిటి చెప్పు ! వాసూ !

వాసు : ఇతడు నాకు ముఖ్యమైన స్నేహితుడు. ఇతన్ని

పాపం ఎవరో గట్టిగా కొట్టారట. నువ్వు చికిత్స చేసి కేసు పెట్టడానికి సర్టిఫికేటు ఇవ్వాలి.

[అప్పన్న డేకుకుంటూ వచ్చి వాసుకి సాష్టాంగపడతాడు. వాసు అప్పన్నకి నమస్కరిస్తాడు]

అప్పన్న: బాబ్బాబ్బాబు రచ్చించాల. దిక్కుమాలినోణ్ణి. ఒట్టి పచ్చిని బాబూ! తమ రెంగిలి మెతుకులు తిని బతికేవోణ్ణి. [కాళ్లు పట్టుకుంటాడు]

వాసు: లే! తప్పు! ఫర్వాలేదు, లే! డాక్టరు అమ్మగారు వచ్చారు. వారికాళ్ళు పట్టుకో!

అప్పన్న: [వసంతకాళ్ళమీదపడి] అమ్మ! అమ్మ! దయ సేసినారా? జరంతో ఒల్లు పేలిపోతున్నాది. జెబ్బలు కదప నేను. ఇటుండటు ఒత్తిగిలితే పానాలు పోతాయి. కంటికి కునుకెట్టదు. కాళ్ళకి దెబ్బలు తగలనేదేమో, ఇలా డేక్కుంటూ తమ పాదాలకాడికొచ్చినాను.

వాసు: నువ్వట్టే మాట్లాడకు. చాలా నీరసంగా ఉన్నావు. శోష వస్తుంది.

అప్పన్న: అమ్మమ్మ! సచ్చిపోనాను. గుండెల్లో నొప్పి-
(వెనక్కి పడిపోతూంటే వాసు వెళ్ళి అప్పన్న వీపుకి తనశరీరం ఆనించి పట్టుకొని కూర్చుంటాడు. రామం వెంటనే వెళ్ళి ఆసరా ఇయ్యగా వాసు తప్పుకొని లేస్తాడు.)

వసంత: వీడా నీ ఫ్రెండ్ వాసూ?

వాసు: అవును. మానవజాతంతా ఒక కుటుంబమనే నాభావన.

వసంత : ఎవరో ఫ్రెండంటే, ఇంకా ఏ జెంటిల్‌మనో, ఏ రిచ్ మానో [Rich man] మనకుతగిన కేసు కదా అనుకున్నాను.

వాసు : జీవితకాలంలో పనంటే ఎరగక, సోమరితనం వల్ల రోగాలు తెచ్చుకొనే ధనికుల కేనా నువ్వు డాక్టరువి. విశ్రాంతిలేకుండా పాటుపడినా కడుపునిండా కూడుదొరకక-దరిద్రంవల్ల రోగపీడితులయే బీదలకి నువ్వు డాక్టరువి కావన్నమాట !

వసంత : ఎక్స్‌క్యూజ్ మి ! [Excuse me] ఇల్లాంటి స్లమ్స్ [Slums] లోను గుడిసెలలోను నేను ట్రీట్ చెయ్యలేను సుమా!

వాసు: ధనాకర్షణతోబాటు దాక్షిణ్యం కూడా నీవృత్తి ధర్మంలో ఒక భాగమనుకొన్నాను. నీకు ధనమే ప్రధానమైతే నీయిష్టంవచ్చిన ఛార్జీ చెయ్యవచ్చును.

వసంత : ఇది మరింత ఇన్సల్టూ ! ఇలాంటి డర్టీ ఫెల్లోస్‌కి ఈహాట్సులో ట్రీట్ చెయ్యమని నన్ను తీసుకొచ్చావుగదా ! నీకిదేమయినా మర్యాదగా ఉందా ? నన్ను ఫూల్ చెయ్య డానికి తీసుకొచ్చావా ? ఈగుడిసెలంట తిరగడం చూస్తే రేపు రెస్పక్టబుల్ పీపుల్ ఎవరేనా మళ్లా నన్ను పిలుస్తారా? నీకుమాత్రం ఇదేం గౌరవం? ఎవడినో పట్టుకొని వాడు నీకు ఫ్రెండంటావు !

వాసు : ఇతనికి తిండిలేదు. గుడ్డలేదు. శరీరమంతా అస హ్యంగా ఉంది. బాగా గాలి వెలుతురు వచ్చే ఇల్లులేదు. ఇంట్లో దుర్వాసన. కడుపులో ఆకలి మంటలు రేగుతూన్నా

జీవితమంతా చీకటి. ఈదురవస్థకి నీహృదయం కరగలేదూ? దరిద్రనారాయణుడు నీకళ్ళముందు తాండవం చెయ్యలేదూ? స్త్రీసహజమైన కరుణరసం కొస్తయినా నీహృదయంలో లేదూ? స్వీయసుఖమే పరమోద్దేశ మనీ జీవితాదర్శమనీ అనుకొనేవాళ్ళకి నేనేం చెప్పేది!

వసంత: వాడిని పట్టుకొని అతడు అతడు అని ఆమన్నించడమేమిటి? ఆనమస్కారాలు చెయ్యడమేమిటి? పల్లెటూళ్ళో పడిపోయి సెల్ఫురెస్పెక్టు కూడా చంపుకున్నావేమిటి? నీహోదాకి తగిన డిగ్నిటీ ఏదీ? ఆర్ యు రియలీ గెటింగ్ మాడ్? [Are you really getting mad?]

వాసు: నీదృష్టిలో నేనేకాదు ప్రపంచమంతా పిచ్చిగా కనబడవచ్చును. అయితే ఇతనికొక సర్టిఫికెటుకూడా ఇయ్యడానికి వీలులేదన్నమాట!

వసంత: సర్టిఫికెటూం! ఇంపాసిబుల్! వీడి వెనకాల కోర్టుకిపోయి సాక్ష్యాల కెవరు తిరుగుతారు? నీకు వాడి విషయమై శ్రమ తీసికోవాలనుంటే చక్కా గవర్నమెంటు హాస్పటల్‌కు పంపు. అదీ నాసిన్సియర్ అడ్వైజ్. నామాట విను. నీడిగ్నిటీ నిలబెట్టుకో!

అప్పన్న: అమ్మ! అమ్మ! పానాలు పోనాయి. సచ్చిపోనాను. మరి బతకనేను.

రామం: ప్రస్తుతం ఈబాధ తగ్గడానికి ఒక ఇంజక్షన్——

వసంత: [See that] సీదట్! చూశావా! అతను అలాగే మాట్లాడుతాడు.

వాసు : పోనీ ప్రస్తుతం బాధ తగ్గడానికి ఒక ఇంజక్షన్ ఇవ్వడానికి వీలు లేదూ ?

వసంత : ఐసే ! [I say!] వాసూ ! నువ్వు నన్ను అల్లరి పెట్టడానికి తీసుకొచ్చావేమిటోయి? నన్ను అవమానించడమే పనిపెట్టుకొన్నట్టుంది. మాలాళ్ళకీ మాదిగాళ్ళకీ ట్రీట్ చెయ్య డానికి నేనా దొరికాను నీకు ? న్యూసెన్సు ! ఇక్కడ నేనొక్కక్షణం ఉండలేను. కావలిస్తే అతన్ని తోడిచ్చి ఇమీడి యట్‌గా వాడిని హాస్పటిల్‌కి రిమువ్ చెయ్యి. నేను R.M.O. కి లెటర్ ఇస్తాను వెంటనే అడ్మిట్ చెయ్యమని.

వాసు : వసంతా ! నీకింత విపరీతపు టూహాలుంటాయని ఎన్నడూ అనుకోలేదు. మాలవాడు మనుష్యులలో లెఖ్ఖ కాదూ ? ధనవంతుడయినా కిరస్తానంలో చేరినా మాలవాడు గొప్పవాడవుతాడా ? బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రధానమం త్రిగా ఉండిన లాయడ్ జార్జిని పెంచిన మేనమామ చెప్పులు కుట్టుకు బతికాడు. సోవియట్ రాజ్యాన్ని పాలిస్తూన్న రష్యానియంత స్టాలిన్, జోళ్ళుకుట్టుకు నేకుటుంబంలోపుట్టాడు. ఆదిపురాణం రామాయణం వ్రాసిన వాల్మీకి హరిజనుడు. ఇక్ష్వాకువంశానికి పురోహితుడయిన వశిష్ఠునిభార్య అరుంధతి మాతంగి. నువ్వేదో పెద్ద కాంగ్రెసువాది కుమార్తెవు గనుక ఇతన్ని సోదరుడిలాగ చూసుకుంటావని ఆశించాను. నీకు కనికరం కలగలేదు. మానవత్వం వికసించలేదు. ఏంచేస్తాం !

రామం : ఆకారులో మెల్లిగాపడుకోపెట్టేసి గవర్న మెంటు ఆసుపత్రికి వెంటనే తీసుకుపోతే.........

వసంత : ఐసే! నీపేరెవరో నాకు తెలియదుకాని నీకీ ధోరణిలో మాట్లాడవద్దని మాత్రం వార్నింగు ఇస్తున్నాను. వాటీజ్ దిస్ ? షీయర్ ఇన్సల్టు! [What is this? sheer insult!] వాసూ! మనం పోదాం రా!

వాసు : నీకు తొందరగాఉంటే నువ్వు వెళ్లవచ్చును. అనవసరంగా నిన్నిక్కడికి తీసుకొనివచ్చి శ్రమయిచ్చినందుకు క్షమించు. ఇతనికేదో దారిచూస్తేగాని నేను రాడానికి వీలులేదు.

వసంత : వాడికేం ఫర్వాలేదు. హి విల్ బి ఆల్ రైట్ (He will be alright) నువ్వు రద్దూ!

వాసు : నువ్వు అతన్ని ముట్టుకోనేనా ముట్టుకోలేదు. చేతితో ఒక్కక్షణం నాడి అయినా చూడకుండా అతనికి వచ్చినఫర్వాలేదంటున్నావు. నీకున్న ధైర్యం మాకెలాగుంటుంది?

వసంత : ఈలెక్కని నువ్వెంతమందికి హెల్పు చెయ్యగలవోయి? పెద్దకబుర్లు చెప్పుతావు కాని-

వాసు : ఏదో అవకాశం ఉన్నంతమట్టుకు.

వసంత : అయితే నువ్వు రావన్నమాట! రావుకాదూ! నీవుద్దేశం నాకు తెలిసింది. నన్ను నిజంగా ట్రీటుమెంటుకే తీసుకొచ్చావా? ఈవిధంగా అమర్యాదా చెయ్యడానికికాని. బోధపడింది. ఇది రెండవసారి. (వెళుతుంది)

(వాసుకూడా ఆమెవెనుక వెళ్లి టాక్సీడ్రైవరుతో మాట్లాడివస్తాడు)

వాసు : రామం! ఆటాక్సీడ్రైవరుతో చెప్పాను. వసంతని దిగబెట్టి వెంటనే వస్తానన్నాడు. ఆటాక్సీలో పడుకోబెట్టి ఇతన్ని హాస్పిటల్‌కి తీసుకువెళదాం!

అప్పన్న : (కళ్లుతెరచి) ఆయమ్మేంటి బాబు! ఆయమ్మని సూడగానే నాపానాలు పోనాయి

వాసు : ఏమిటీ?

అప్పన్న : నన్ను సంపేసిన బుగతగారి కూతురేకాదండి ఆయమ్మ!

వాసు: ఏమిటీ? కృష్ణారావుగారు! సామ్యవాది! దేశంలోని దరిద్రంచూసి సహించలేని దయార్ద్రహృదయుడు! హరిజన సేవకకంకణం కట్టిన కాంగ్రెసు వాది! ఆయనే! ఆయనేనా నిన్ను కొట్టారు?

అప్పన్న : ఆబాబేనండి. రేపు పండుగనగా ఆరింటికెల్లి ఏఁవయినా ఇప్పింసండి బాబూఅని అడుక్కున్నాను. గుమ్మం తొక్కొద్దని కిందికి గెంటేసినాడు. పండుగునాడు పొద్దున్నే తోట్లోకొచ్చి ములంకాడలు నేవు, పువ్వులు నేవు, అన్నీ దొంగతనాన్ని అమ్ముకుంతావాఅని కర్రట్టుకొని తెగబాదేసినాడు. కడుపుగడసకపోతే ఓ కానిడబ్బు అడుక్కుంతాం గాని దొంగతనమెందుకు బావ్!

వాసు : ఆహా! ఊహాతీతంగాఉందే ఈకపటనాటకం! ఈవన్నె కాంగ్రెస్‌వాది! ఈదీనరక్షకి డాక్టరు!

రామం : స్వంతవిషయం గనుకనే అమ్మగారంత తొందరగా పారిపోయారు.

వాసు: రామం! హాస్పిటల్‌లో ఇతనికారోగ్యం కలిగే వరకూ ఎవరినైనా తోడియ్యాలి. మన వెంకటరెడ్డి ఉంటే బాగుండును.

రామం: ఇక్కడకే వస్తారు మన రైతుసోదరులు. భోజనాలయాక ఇక్కడ కలుసుకోమని చెప్పేవచ్చాను.

వాసు: [అప్పన్నతో] నీ పేరేవరమ్మా!

అప్పన్న: అప్పన్నగోడు బాబ్!

వాసు: చూడు అప్పన్నా! నువ్వు బాగా ఆరోగ్యం కలిగేవరకూ ఆసుపత్రిలో ఉండు! మా రైతుసోదరుడు వెంకటరెడ్డిని నీకు తోడిస్తాం! ఆరోగ్యం కలిగిన తరువాత నువ్వూ నీకుటుంబమూ మాభాగ్యవరం రండి! అక్కడే కాపురం ఉండవచ్చు. నీజీవనానికి లోటులేకుండా సదుపాయంచేస్తాను.

అప్పన్న: సిత్తం బాబూ! బతికున్నన్నాళ్ళు తమ సెప్పులు మోసుకొని బతుకుతాం! మీరాగులాపోళ్ళమి.

[వెంకటరెడ్డి రైతులు వస్తారు.]

వాసు: వెంకటరెడ్డీ! మనమీరాత్రే వెళ్ళాలి కాదూ!

వెంక: తెల్లారిజామున కొత్త సెరుకుగానుగెత్తాలని సెలవిచ్చినారు.

వాసు: అవును. అదీగాక ఉదయమే మేనేజరుగారు మనగ్రామం వచ్చి తనిఖీ చేస్తారట.

రామం: తమరు వీరిని తీసుకొని భాగ్యవరం వెళ్ళండి. నేనూ వెంకటరెడ్డీ ఇతన్ని కార్లో తీసికొనివెళ్ళి ఆసుపత్రిలో

చేర్చేస్తాము. వెంకటరెడ్డి ఇతనికి తోడుగా ఉంటాడు. నేను వెంటనే వచ్చి దారిలో తమరిని కలుసుకుంటాను.

వాసు : వెంకటరెడ్డీ ! ఏమంటావు ?

వెంక : తమసెలవే ! నన్నడగాలా ?

వాసు : చూడూ ! ఈపదిరూపాయలూ నీదగ్గరుంచుకొని అతనితిండికీ, కొనవలసిన మందులకీ ఖర్చుపెట్టు. [రెడ్డికి నోటు ఇస్తాడు. కారు చప్పుడు వినబడుతుంది.] కారు వచ్చినట్లుందే! నలుగురూ సాయంపట్టండి. [వాసు అప్పన్న కాళ్లు పట్టుకుంటాడు. అప్పన్న తప్పించుకొని]

అప్పన్న : ఒద్దు బాబూ ! తమరు పెబువులు. (వాసు పాదాలు కళ్ళకద్దుకొని) నానిలాగే మెల్లిగా డేక్కొస్తాను. గుండె నొప్పి కాస్తసద్దుకుంది బాబూ! ఉండుండి, యెన్నులోకొక్క పోటు పొడిచేస్తాది; దీనితల్లిసిగ్గోసిన నొప్పి.

[అప్పన్న డేకుతూ వెళతాడు. అందరూ వెంట వెళతారు.]

రామం : నేను వెళ్ళి ఇతనిభార్యకి ధైర్యంచెప్పి వచ్చేస్తాను. పాపం ! జ్వరంతో లేవలేకుండా పడుకుంది.

వాసు : వెళ్ళు వెళ్ళు ! అవసరమయితే ఆమెనుకూడా హాస్పిటల్లో చేర్చుదాం.

[రామం వెనక్కి వెళతాడు.]

అప్పన్న : మాకరమ్మ మింతేబావ్ ! రెక్కాడితే కాని డొక్కాడదు. సూసినారా ! ఇంటిల్లిపాదిమీా పడిపోనాం. తఁవరుమాత్రం ఎంతకనిసేస్తారు.

(వెళతారు)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదవరంగము.



సమయము రాత్రి గం|| 8-30 లు.

[శ్రీపురంనుండి భాగ్యవరంవెళ్ళే దారి. కర్షకగీతాలతో వాసు, రైతులు, రామం ప్రవేశం. జానకి తలవిరగబోసుకొని ఏడుస్తూ భయంతో వెనక వెనక చూస్తూ పరుగెత్తివచ్చి వాసుకాళ్ళమీద పడుతుంది.]

జానకి : నన్ను రక్షించరూ! రాక్షసి! నన్ను చంపేస్తూంది.

రామం : ఎవరమ్మా? ఎవరు ? భయంలేదు. భయపడకు.

జానకి : అదిగో! ఆసానిది. నన్ను బలవంతంచేసి......

[నీలాచలం పరుగెత్తివచ్చి వీరినిచూచి ఆగిపోయి, జానకి చెయ్యిపట్టుకొని]

నీలా : ముండా ! ఇంకెక్కడికెళతావు ! రా !

వాసు : ఆ అమ్మాయి చెయ్యి విడిచిపెట్టండి !

నీలా : ఏటీ ? మీ అధార్టీ యేటి ? [జానకితో] పద ! పద! ఇంటికిపద ! యీపు పెట్లకొట్టగలను.

వాసు : ఎందుకోసం కొట్టడం?

నీలా : సెప్పినట్టినకుండా ఇంట్లోంచి పారిపోస్తుందా ? దారుణం !

వాసు : అమ్మాయీ! ఆమె చెప్పినట్లు వినకుండా ఎందుకు పరుగెత్తి వచ్చావు ?

జానకి : నన్ను బలవంతం చేస్తూంది చూడండీ! ఎవర్నో రెడ్డిని తీసుకువచ్చి, అతని దగ్గర ఆడమంటుంది. నన్ను బలవంతంగా గదిలోకి తోసేసి తలుపుగొళ్ళెం పెట్టేయడానికి చూస్తూంటే తప్పించుకొని, పారిపోచ్చానండీ!

వాసు : రామం! ఇదేదో విచిత్రంగాఉంది. (నీలాచలంతో) ఈఅమ్మాయి మీకేమవుతుంది?

నీలా : ఏమవుతుందా? ఏమవుతుంది! ఎత్తేస్తే ఏడుసెక్కలవుతుంది. కూతురవుతుంది.

వాసు : మీ రెవరు?

నీలా : మేమా? మేమెవరమైతే మీకేం? మీాపరిచ్చలేంటి మాకు?

వాసు : మీరెవరో చెప్పకూడదూ?

నీలా : మేము కళావంతులం!

రామం : ఈ అమ్మాయి మీకడుపున పుట్టినదేనా?

నీలా : మాకులంవాళ్ళకి కడుపున పుట్టడం ఎక్కడో! ఇంత చిన్నపిల్లప్పటినుండీ పెంచి, దగ్గరుంచుకొని, ఆటాపాటా మప్పుతూ. ఇన్నాళ్ళూ పెంచి పెద్దదాన్ని చేశానుగదా, దీనికి అదాత్తుగా ఈ యినాశకాలమేమిా?

జానకి: నన్ను చిన్నప్పటినుంచీ నువ్వు పెంచావా? (వాసుతో) ఇరవై రోజులక్రిందట మాయింటిల్లిపాదిమీా పదిరూపాయల టిక్కెట్టులో తిరపతియాత్ర వెళ్ళామండీ! తిరపతి టేసన్‌లో మావాళ్ళంతా అడావిడిగా రైలెక్కిపోయారు. నేనెక్కకుండా

రైలు వెళిపోయిందండీ! నేను ఏడుస్తూ కూర్చుంటే, ఇదిన్నీ ఇంకోబ్రాహ్మడూ వచ్చి, మావాళ్ళని తెలుసుననీ, మా యింటికి దిగబెడతామనీ చెప్పి ఈఊరు తీసుకొచ్చారండీ! మావాళ్ళు ఇదిగో వస్తారు అదిగో వస్తారని చెప్పి ఎంతపని చేసిందో చూడండీ! (ఏడుస్తుంది)

రామం: మీతల్లిదండ్రులు లేవూరిలో ఉంటారు?

జానకి: కాకినాడదగ్గర రామయ్యపేట మాది. మానాన్న గారు పౌరోహిత్యాలు చేస్తారు.

వాసు: నీకు వివాహమయిందా, అమ్మా!

జానకి: లేదండీ! ఈమాఘమాసంలో చేదామని మా వాళ్లు అన్నిప్రయత్నాలు చేసుకున్నారు.

వాసు: వయస్సుకురాని శుభ్రమైన బ్రాహ్మణకన్యను దొంగతనంగా తీసుకొనివచ్చి వ్యభిచారవృత్తిలో దింపబోతు న్నావా?

నీలా: చిన్నపిల్లేం? మాయింటిదగ్గర ఈమద్దెని పెద్దమనిసి అయిందికాదూ? ఏభయిరూపాయలు ఖర్చుసేసి సంబరం చేశాం గదా!

వాసు: రామం! నువ్విప్పుడే బయలుదేరి ఈఅమ్మాయిని వారిగ్రామం తీసుకొనివెళ్ళి ఆమె తల్లిదండ్రుల కప్పగించిరా!

నీలా: మద్దిని మీతగువేటిమాకు? యేళాకోళాలేటి? మాగోసమీ కెందుకు? మాపిల్లని విడిచిపెట్టండి.

వాసు: రామం! ముందుగా ఈ అమ్మాయిని తీసుకొని

నువ్వు పోలీసుస్టేషనుకు వెళ్లు! కన్యాచౌర్యం చేసినందుకు, కులస్త్రీని కులటవృత్తిలో దింపుతున్నందుకు, ఆమెపై పోలీసు కేసు పెట్టించి, ఈమెచేత వాఙ్మూలమిప్పించు! (జానకితో) అమ్మా! ఇతడు వచ్చి మీవాళ్లకు నిన్ను అప్పచెపతాడు. నిర్భయంగా ఇతనితో వెళ్లు.

[జానకినమస్కరిస్తుంది. జానకిరామం ఒకవైపువెళతారు. వాసు, రైతులు ఇంకోవైపు వెళతారు. నీలాచలం నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడిపోతుంది.]

గోపా: (ప్రవేశం.)

నీలా: ఇంతసేపూ ఎక్కడ అణగారిపోయారు? సమయానికిలేని బాకా అన్నట్లు ఇప్పుడెందుకూ రావడం?

గోపా: నేను చాలా సేపాయివచ్చాను. ఆమూలనిలబడి ఈసంగతంతా చూస్తున్నాను.

నీలా: బాపనపిరికి! మూల దాగోడమేమీ? వాళ్ళు కొడతారని భయం!

గోపా: ధైర్యంలేకకాదే! ఆతడెవరో తెలుసునా? మా ప్రొప్రయిటరుగారి కొమారుడు వాసుదేవరావు. అతనికంట పడడమే నేను!

నీలా: అవ్వ! అవ్వ! ఎంతపని జరిగిపోయింది! నేనతని కంటపడిపోయాను నాబతుక్కాల! నువ్వెంతంటే నువ్వెంతని ఎదిరించాను కూడాను.

గోపా: నీ అమాయికత్వం ఏడిసినట్టే ఉంది. నీమీద కేసుపెట్టి నిన్ను కైదులో పెట్టించేడానికి చూస్తున్నాడు.

నీలా: అమ్మో! నన్ను కైదులో పెట్టేడానికే! మరెలాగ?

గోపా : దానికి తగిన పన్నాగం నేనూ పన్నుతాను. ఇంక ఇతను ఆట ఎలాగ ఆడుతాడో చూస్తాను గాదూ?

నీలా : నాకేమిటిదారి? నాబతుకు నడివీధిలో పెట్టేస్తారా?

గోపా : నేనున్నాను కానటే? ఇలాంటి వాళ్ళనెంత మందినో లాంగదీసి కాళ్ళమీద పడేలాగు చేశాను. ఇతన్ని ముప్పతిప్పలాపెట్టి మూడు చెరువులనీళ్లూ తాగించకపోతే నాపేరు గోపాలం కాదనుకో?

నీలా : నిజంగానేనా? (గోపాలం చేతిలో చెయ్యివేస్తాడు)

[వెళతారు.]

తె ర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదునొకండవ రంగము.

---

[కర్మవీరుని సంచారం. సమయము ఉదయం గం॥ 8 లు.]

కర్మ : పాట : ఆంధ్రశౌర్యమూ, ఆంధ్రతేజమూ
ఆంధ్రరాజ్యమూ, ఆంధ్రశిల్పమూ
ఆంధ్రకవిత్వము, ఆంధ్రగానము,
ఆంధ్రుడవయితే, నిలుపుమురా ॥ఆంధ్రమాతృ॥

సీ॥ కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు,
ఇంటింట దేశిసాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాడు
సుకుమారశిల్పవస్తుప్రపంచమునందు
ఆంధ్రనైపుణి పంతమాడునాడు
సమదసేనావ్యూహజయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాడు

చూచి, సంతోషమున తలలూచి, గర్వ
మాచి, ఆంధ్రపుత్రీపుత్రులందగలరు
శాంతి; అందాక లేదు విశ్రాంతి మనకు
కంకణవిసర్జనల కిది కాలమగునె ॥ [రాయప్రోలు]

[వెళతాడు]

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పండ్రెండవరంగము.



( సమయము ఉదయము గం॥ 9 లు. )

(శ్రీపురంలో లక్ష్మీపతి ఇల్లు. గోపాలం కుర్చీమీద కూర్చొని టేబిలు మీద వ్రాసుకుంటూ ఉంటాడు. గోపాలం-కోటు, పాగా, కళ్ళజోడు. లక్ష్మీపతి ప్రవేశం. లాంగుకోటు, పాగా, నెరుస్తూన్నమీసం, కళ్ళజోడు, చేతికఱ్ఱ, వయస్సు 55 సం॥ పైగా)

గోపా: (లేచి) మన వకీలుగారింట్లో బారసాలట, మంచి రకం, రెండు బెల్లపుదిమ్మలు పంపించమని వారి గుమాస్తా కబురంపాడు.

లక్ష్మి: అయితే మంచిరకం ఏవో పంపించు. తప్పుతుందా ఏమిటి?

గోపా: అబ్బాయిగారు మంచిరకం బెల్లం తయారుచేయిస్తున్నారు. పంచదారరంగు, అమిత తియ్యదనం, అందులోవి పంపిద్దాం!

లక్ష్మి: అన్నట్టు నిన్న వెళ్ళి వాడిపని చూసి వచ్చావు కాబోలు, ఎలా ఉంది?

గోపా: ఏమిటో దానిగురించి ఏమీ అడక్కండి.

లక్ష్మి: ఏమీ? ఏమిటి సంగతి?

గోపా: ఆచెరువులో మూడువేలు పోసేశాగు. నాకంటికి వెయ్యిరూపాయల పనయినా కనిపించలేదు. ఈపెద్దచదువులు చదువుకొన్న వాళ్ళకి పనిరామిా ఏం తెలుస్తుంది? పెర్షియన్ వాటర్ వీల్ [Persian water wheel] అని కొత్తరకం ఏతాం ఒకటి తెప్పించారు. అదిమాత్రం కొంత ఉపయోగంగా ఉంది. కొత్తరకం నాగళ్లు చాలాఉన్నాయి. మొత్తం వీటిక్రిందే అయిదువేలు అయింది.

లక్ష్మి: మతిపోతూందా ఏమిటి చెప్మా వీడికి?

గోపా: ఒక్కసారి తమరు వెళ్ళి చూడవలసింది.

లక్ష్మి: ఎక్కడ తీరుబడి? తెల్లారిలేస్తే కోర్టులతో సరి మనకి.

గోపా: ఎద్లు మాత్రం బాగాబలుస్తున్నాయి. పదుహేను జతల ఎద్లు.

లక్ష్మి: మావాడికి ఉద్యోగమాయితే మన ఇల్లు గుఱ్ఱాలశాలే అన్నాడట. అలా ఉందీచదువు. ఇప్పటికంతా అయిదువేలు అయిందా?

గోపా: ఇంకో అయిదుకూడా కలపండి.

లక్ష్మి: ఏమిటీ! పదివేలు పెట్టేశాడూ? ఒక్క గ్రామానికే? అయితే భూములు మళ్ళా కొనుక్కున్నట్లే అయింది.

గోపా: తమరు ఎండనక, వాననక తిండితిప్పలు లేకుండా నాబొందో అని కూడబెట్టినదంతా సద్వినియోగం కావద్దూ? డబ్బుమాటకేమిగానండి, అర్రైతువాళ్ళని వెనకేసుకొని

వాళ్ళతో పాటలు పాడుకుంటూ పార, బొరిగె పట్టుకొని ఆయన పొలంపాటు పడుతూంటే నాకు మహాకష్టమనిపించిం దండి చూడ్డానికి.

లక్ష్మి : పార బొరిగె పట్టుకొని పొలంపాటే ? నిజంగానే?

గోపా : అపరాలా ! నేను కళ్ళారా చూస్తేనే ! రామ! రామ! రోజుకి రెండురూపాయలు పుచ్చుకొనే కూలివాడైనా అంతపాటు పడడు.

లక్ష్మి : నాపరువూ ప్రతిష్ఠా గంగలో కలపడానికి పుట్టాడు వీడు. ఇంతసొమ్మెందుకిచ్చావు వాడికి ?

గోపా : ఆయనికి కావలసిన సొమ్మిమ్మని తమరు ఆర్డరు వేశారు. తనకు కావలసినసొమ్ము అడిగి ఆయన పట్టుకువెళు తున్నారు. తమ రెండో వారూ అంతేనాకు. మధ్యనినేనెవణ్ణి అడ్డుపెట్టడానికి ? నేనేమాటన్నా తండ్రికీ కొడుక్కీ మధ్యని పొరలుపెట్టానని వాదునాకా ?

లక్ష్మి : అయింది ఎలాగా అయింది. ఒక తలమాసిన వాడు దివాలా తీసి ఎగేశాడనుకుందాం. ఇకముందుమాత్రం కానీ ఇవ్వక ఇక్కడికిపని చాలని చెప్పు!

గోపా : తమనోటంట ఆమాట వస్తే నాకు ధైర్యమే! ఇకముందు ఎవ్వరని యేగాని ఇస్తే ఒట్టు.

లక్ష్మి : [దగ్గుతాడు]

గోపా : దగ్గుతున్నారేమిటి ?

లక్ష్మి : వారం రోజులాయి వేడిచేసి దగ్గుకూడా పట్టు కుంది. రాత్రులు తెల్లవార్లూ మేలుకోవడమే కదా!

గోపా : అజీర్ణం బాధ తగ్గినట్లేనా ?

లక్ష్మి : అదీ అలాగే ఉంది. అన్నహితవు బొత్తిగా తగ్గిపోయింది.

గోపా : ఆమధ్య తరుచుగా కోర్టుపనిమీద పట్నంవెళ్ళినప్పుడు తమకా అరవభోజనం పడిందికాదు.

లక్ష్మి : ఏమితిండిపోనిద్దూ ! శుచా ? శుభ్రమా ? వృత్తిమాలకూడు !

గోపా : మాలకూడంటే జ్ఞాపకం వచ్చింది. అబ్బాయిగారక్కడ మాలకుటుంబం ఒకటి చేర్చారు. వాళ్ళనీయన కాగలించుకు తిరగడం;ఒకటేమిటి అక్కడిసంగతు లడక్కండి!

లక్ష్మి : ఏడిసినట్లే ఉంది. ఆనరసింహశాస్త్రిగారు మళ్ళా ఉత్తరం వ్రాశారు.

గోపా : ఏమంటారు ?

లక్ష్మి : పదహారువేల కట్నానికీ ఒప్పుకున్నారు. పిల్ల కట్టు తప్పిపోతూందని, వెంటనే చేసెయ్యాలనీ తొందర! శ్రోత్రియ కుటుంబం; అగ్రహారీకులు!

గోపా : వారికి అబ్బాయిగారి సంగతి తెలిస్తే చిక్కే ! ఈయన పొలంపాటు, కూలిపని, మాలాళ్ళని కాగలించుకొని తిరగడం చూస్తే వారు పుంజాలు తెంపుకు పారేపోతారు. ఇంతకీ ఇక్కడ కృష్ణారావుగారి అమ్మాయిని చేసుకోడానికి మాట ఇచ్చారట !

లక్ష్మి : ఏకృష్ణారావు ? నాన్కోపరేషనతనా ? అతని దగ్గరేముంది ? అంతా సున్నచుట్టేశాడే !

గోపా: ఆఅమ్మాయి ఇక్కడ డాక్టరు. ప్రాక్టీసుచేస్తూంది. ఇప్పుడు ఆవిడగడనే ఇంటికాలక్షేపం.

లక్ష్మి: ఆ అమ్మాయిని మావాడు పెళ్ళాడుతాడూ? ఆదేంపెళ్ళయ్యా? ఆవిడ కెన్నేళ్ళుంటాయి?

గోపా: పాతికేళ్ళయినా లేకపోతే మెడికలు ఎలా ప్యాసవుతుందీ?

లక్ష్మి: బాగానే ఉంది. ఇంకో పదేళ్లు పోనీకూడదూ! ఇప్పుడేమంత తొందరొచ్చింది పెళ్ళికి? నేను బ్రతికుండగా మాత్రం రజస్వలానంతర వివాహం చెయ్యను. నా అనంతరం ఎవడెలాగ పోతేనా కేంకావాలి. మావాడిని రేపో యెల్లుండో రమ్మని కబురుపెట్టు! పదహారువేలూ కట్నమిచ్చే బంగారు లాంటి సంబంధమొస్తే, గోచీమొల్తాడూ లేని కృష్ణారావు కూతురినా చేసుకుంటాడు?

గోపా: ఈపట్టున అబ్బాయిగారువచ్చి తమకు ఆసరాగా ఉండడం అవసరమే! తమకు శరీరంరుగ్మతలో చేరిపోయింది. ఇంకతిరగలేరు. ఈపాటి ఆయనవచ్చి నాలుగువ్యవహారాలు చూసుకొని ఏభూమి ఎక్కడుందో, ఏపత్రంఎవరిదో తెలుసు కొని పనిలోకి అందుకుంటే తమ ప్రాణాని కెంతసుఖం!

లక్ష్మి: ఈమాటు ఘట్టిగా చెప్పేస్తాను. పదివేలూ తగ లేసి మాలకూడు తింటూ, గొప్పతవ్వడం ఏతాం తొక్కడం నేర్చుకోడానికా ఈకోయంబత్తూరు చదువు? వద్దు వద్దని శతపోరితే విన్నాడా? ఆ యోగిగారితో వెళ్ళి ఆదేశమంతా

తిరిగి వచ్చాడు.

గోపా : ఇదంతా ఆరామం మప్పందలేనండి. అతగాడి ఊరికి ఛోటాగాంధీ.

లక్ష్మి : రామాన్ని నేనే వెళ్ళమన్నానులే. తోడుగా ఉంటాడని! వెళ్ళాడయ్యా! దేశమంతా చూసివచ్చాడు. దానికేం! వచ్చాక పోనీ, చదువుకొన్నవాడుగదా వ్యవసాయం బాగుచేస్తాడేమో అని నేనాశపడితే, డబ్బంతా తగలేసి ఇదా వీడు చేస్తున్న పని ?

గోపా : ఈపాటి ఆయన్నింటి దగ్గరుంచి తమరు కొన్నాళ్లపాటు శ్రద్ధగా మందు పుచ్చుకొని విశ్రాంతి తీసుకుంటే బాగుండును. ఏముంది నాచేతిలో పడితే నాలుగువ్యవహారాలు ఒక్కపూటలో మప్పేస్తాను. జబ్బుగా ఉన్నప్పుడైనా తండ్రిని కనిపెట్టకపోతే మరి కొడుకెందుకు?

లక్ష్మి : నీప్రాజ్ఞత మావాడికుంటే ఇక కావలసిందేమిటి? నీప్రాజ్ఞత మావాడికి తల్లక్రిందులా తపస్సుచేసినా రాదు. ఏదావాకి ఎప్పుడు వాయిదావో, ఏనోటు ఎప్పుడు కాలదోషం పడుతుందో, ఏఆస్తి ఎప్పుడు వేలానికి వస్తుందో, ఇదంతా నీకు కరతలామలకం గదా !

గోపా : తమకు భోజనానికి వేళయింది, లెండి.

లక్ష్మి : ఏంభోజనం ! ఒక్కమజ్జిగా అన్నంతప్ప ఇంకేదీ కడుపులోకి వెళ్ళదు.

గోపా : మంచిడాక్టరుని చూసి ఏర్పాటు చేస్తాను. శ్రద్ధగా మందుపుచ్చుకోండి.

లక్ష్మి : ఈపుష్యమాసం పోనీకూడదూ ? శూన్యమాసం!

గోపా : అయ్యొచ్చేదాకా అమావాశ్య ఆగుతుందా? మునపటికీ ఇప్పటికీ చాలా నీరసపడిపోయాడు. మాటకూడా లోయేట పడింది.

లక్ష్మి : అయితే ఏదో మంచిరోజు చూడు! పోతాను. కాస్త మజ్జిగాఅన్నం పిసుక్కొని తాగి సాగోరాలి.

గోపా : అబ్బాయిగారిని రమ్మని కబురంపుతాను.

లక్ష్మి : [ఇంట్లోకివెళుతూ] పంపు పంపు! కట్టుదిట్టంచేసుకొని ఆసంబంధంస్థిరపరచుకోవాలి. ఆలస్యమయినకొద్దీ ఒక్కొక్క సంబంధమూ తేలిపోవడమే! [వెళతాడు]

గోపా : అలాగేమరి! అమ్మగారొస్తే అన్ని ఆటలూ కడతాయి. (వీధిలోకి వెళిపోతాడు)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదమూడవ రంగము.



[సమయం ఉదయం 10 గంటలు]

(భాగ్యవరంలో వాసు పారిశ్రామికశాల. రైతులు, ముఖ్యంగా వెంకటరెడ్డి, వీరన్న, అప్పన్న ఉంటారు. చాపలల్లడం కొబ్బరితాళ్లు పేనడం నూలుతీయడం మొదలగు చేతిపనులలో నిమగ్నులై సంభాషిస్తారు.)

వెంక: మనం పాతికేళ్ళనుంచీ బాబుగారి బూములు కని పెట్టుకున్నాం గాని యీపాటిపంట ఎన్నడూ సూడలేదయ్యా. మాగొప్ప పనిసేయించేసినారు పెబువులు.

వీరన్న: ఆరికేటి పట్టిందిరా! లచ్చాదికార్లు! కాలు మీాద కాలేసుకు కూకోనేకేటి? మనతోపాటు ఎండనక, వోననక పనిసేస్తున్నారుగందా, ఆరు పాదమెట్టబట్టే బూదేవి పిలిస్తే పలికినాది.

వెంక: యీారన్నా! బాబుగారు సేత్తో పారట్టుకుంటే నావొల్లు సచ్చిపోనాదిరా! ఆరిపాదాలట్టుకొని బతిమలాడు కొన్నాను. బాబో తంవరు పారట్టుకోవద్దంటే ఆమారాజింటేనా? ఆరి ఊరెల్లాలంటే రానూబోనూ పదికోసులూ నడకేకదా మారాజు.

అప్పన్న: బాబుగారిది మాజాలిగుండె. ఆరికి ఈళ్లూ ఆళ్లూ

అన్నమాటే నేదు. నన్ను బతికించినారుకాదా సెబుతే లు! రెండుపూటలకే నయమై పోనానే!

వెంక : ఆరు దేవుడులాటోరే ! దేవుడయితే యీరికంటె ఎక్కువేటి? ఎన్నెన్ని యిసింతాలు నేర్పిస్తున్నారో సూసినారా?

వీరన్న : బట్టలు సూడవోయి? ఎన్ని రకాలు నేయిస్తున్నారో! మనఊళ్ళో యీరబసవన్నా ఆళ్లా మగ్గాలు తొంగుడున్నాయని పట్నాలంట పోనారా? ఆళ్ళంతా మళ్లా ఇక్కడికే ఒచ్చేసినారు. ఇప్పుడొల్లమాలినపని.

వెంక: మామ్ముత్తవ్వకాడనుంచీ మూలపడిపోయిన రాట్నాలన్నీ పైకితీయించినారు కారా బాబయ్యా!

వీర : బట్టలమాటకేంగాని తుంగసాపలు తివాసీలు సూసినావోయి ఏంసింత్రింగా ఉన్నాయో !

వెంక : ఆరు సేయించే పనులకద్దూపద్దూ ఉందటోయి ! తాటినారెట్టి కుంచెలు సేయించడమేటోయి ! ఏనాడయినా యిన్నామోయి !

వీర : అన్నిటికంటె యిసిత్రం జనపనారతో తెల్లనికాగితాలు సేయించేస్తున్నారు! కుంపినోడి మాయ మరిబాబుగారికాడ డెక్కాడదే!

వెంక : నాకు కాకాలు ఒచ్చేసినాయి. మాఅబ్బాయి గుణింతమే పట్టేసినాడు.

వీర : అప్పన్నా మరి నువ్వుకూడా సదువుకోవోయి.

అప్ప : ఏనాడు యింటావొంటా నేదు నన్నా సదుగులో నెట్టకండి బావ్ !

(వాసు చేతిలో ఉత్తరాలతో ప్రవేశం. అందరూ లేచినమస్కరిస్తారు)

వాసు : అప్పన్నా ! అలా ఎడంగా కూర్చుంటావేం ? దగ్గరకి రా ! (అప్పన్న వాసు దగ్గరగా కూర్చుంటాడు)

వెంక : మాయిళ్ళల్లో మాసెడ్డ గోసగా ఉంది బాబు ! శమరెన్ని సెప్పినా మాయూడోళ్ళు మాపాణాలు తినేస్తు న్నారు. ఈమాలాడితో తిరుగుతున్నామని.

వాసు : ఈకులభేదం అంతరిస్తేనేగాని దేశానికి ముక్తి లేదు. కులాలెంతమాత్రము సంఘాలుకావు. బ్రాహ్మలొక సంఘం, కోమట్లొకసంఘం, శూద్రులొకసంఘం, మాలలొక సంఘం అనుకొనే రోజులు పోవాలి. గ్రామమంతా ఒకటే సంఘం! ఒకటేకుటుంబం! గ్రామానికే వ్యక్తిత్వం! తెలిసిందా?

వెంక : నిజంవేన్రాపి! నాను బేపిని పెంచుతున్నానుకానూ! జేపి పాటి సెయ్యడేటీడు?

వాసు : మనకి ఒక ఇంజనీరు పశువులడాక్టరు వస్తున్నారు.

వెంక : ఎవరుబాబు ఎక్కడనుంచొస్తున్నారు ?

వాసు : ఇప్పుడే ఉత్తరాలు వచ్చాయి ! పింఛను పుచ్చు కొని గ్రామసేవయందభిమానమున్నవా రెవరయినా దయ చేసి వస్తారేమో తెలియజేయవలసిందని పత్రికలలో ప్రక టించాను. ఇద్దరు వస్తున్నట్లు వ్రాశారు. మనమంతా శ్రమ పడి వారికి శుభ్రమైన ఇళ్ళు తయారు చెయ్యాలి.

వెంక : మనకి ఎదుళ్లున్నాయండి. తాటాకు సెలవయితే కొట్టిస్తాను.

వాసు : ముందు దిట్టంగా బెందడితో గోడలుపెట్టించాలి. కిటికీలు బాగా పెద్దవి పెట్టాలి. గోడలు ఎత్తుగా ఉండాలి. ఇంటికీ ఇంటికీ మధ్య చాలా దూరముండాలి. అన్నట్లు మీ పేధుల్లో మురికంతా పొలాల్లోకి పోయేలాగ కాలువలు తవ్వించారా ?

వెంక : ఓ ! తవ్వేసినామే ! సూసుకోండి బాబూ !

వాసు : ఇళ్ళదగ్గర ఏమాత్రమూ నీరునిలవకుండా చుట్టూ ఎత్తు చేసుకున్నారా ?

వెంక : ఓ! సేసుకున్నాంబాబూ! ఇప్పుడెక్కడా తమదయ వల్ల కంపు నేదే ! ఒక్క దోమకూడా నేకుండా పోనాయి.

వాసు : వీధులన్నీ శుభ్రంగా తుడుచుకుంటున్నారా ? చెత్త దూరంగా తీసుకుపోతున్నారా ?

వెంక : బాబుగారికి మాసెడ్డ అనుమానంరా ! తమరు మాయిూదికొచ్చి దరియాప్తు సేయించండిబాబూ ! మాకోసం సెపుతూంటే సేసుకోక మాకేం వొల్లు కొవ్వించేటి ?

వాసు : మీరంతా మరబియ్యం పూర్తిగా మానేసినట్లేనా ?

వీర : ఓ! పెతీయింట్లోనూ తెల్లారిలేస్తే రోళ్ళూరోకళ్ళూ కొయ్యతిరగళ్ళూ తెగసప్పుడే ! మాయాడ దీనూలు తీసింది సిత్తగిస్తారా? [వడుకునూలు ఇస్తాడు]

వాసు : (నూలుచూస్తూ) భేష్! పొందూరు సరుకులాగుంది. చేతిలో ఇంతపని పెట్టుకొని మనం అనవసరంగా దరిద్రమనుభ విస్తున్నాం! రైతుకి వ్యవసాయపుపని లేనప్పుడు ఈచేతి పనులు చేసికోవడంవల్ల ఎంతలాభమో బోధపడుతూందా? ఈకార్యక్రమం లేకుండా ఆంధ్రరాష్ట్రం వచ్చినా నిరర్థకమని వాదిస్తాను.

వెంక : తమరేటి గారిడీ సేసినట్లుగా ఈఒక్కసాలుల్లోనే మూడింతలు పంట పండించేసినారు. ఇలాగుంటే బాబుగారి సిస్తెప్పుడూ బకాయే పడదు.

వాసు : బకాయిమాట మీ రెత్తుకో నక్కరలేదు. మీరు కష్టపడి ఎక్కువపంట పండించినప్పుడు అది మీకు ముదరా యివ్వడం న్యాయం.

వెంక : దివ్వెట్టి మొక్కినా ఈబాబుకే మొక్కాల! నిజంగా రైతోళ్ళపాలిటి దేవుడే ఓరా!

వాసు : అప్పన్నా! నువ్వు తోళ్లు పదును చెయ్యడం, జోళ్ళుకుట్టడం నేర్చుకోరాదూ!

అప్ప : సిత్తం! తమదయవల్ల కాంత జవసేరింది గనక అలాగే సేతాం.

వెంక : అదేటి! సిన్నబాబొచ్చేస్తున్నారు. ఆయమ్మని కూడా తీసుకొచ్చేస్తున్నారేటి? (రామం, జానకివస్తారు)

వాసు : ఏంరామం! ఏమయింది?. ఈఅమ్మాయిని తిరిగీ తీసుకొచ్చేశావేమీ?

రామం : ఈమె తలిదండ్రులు పరమఛాందసులు. 'కులం చెడిపోయింది; వేశ్యాగృహంలో ఉంది; అక్కడే రజస్వలా అయింది' అని ఇంకా ఏమిటేమిటో అనుమానాలు పడి ఎంత నచ్చచెప్పినా చేరతీశారుకారు.

వాసు : అయితే ఈమెచెప్పినది నిజమన్నమాటే !

రామం : ఈమె చెప్పిన ప్రతిఅక్షరమూ నిజము. ఆఖరుకి ఈమెతల్లిగారు మెత్తపడి అంగీకరించి భర్తని ఒప్పించడానికి చూశారు. ఆయనకి నిప్పులు కడిగే ఆచారం. "కులంలో వెలి వేస్తారు; పనికిరాదు; ఈపిల్ల ఎప్పుడు తప్పడిపోయిందో అప్పుడే చచ్చిపోయిందని నిశ్చయించుకున్నాం; ఇప్పుడెందుకు మళ్ళా మాకీచిత్తక్షోభ; మీరేకులంవారో; మీకు ఈపిల్లకి ఏమిసంబంధంకలిసిందో" అని నామీద కూడా అనుమాన పడడం మొదలెట్టారు.

వాసు : ఎంత కాఠిన్యం ! ......మరి. గత్యంతరం ?

రామం: మనకిఆలోచనక్కరలేదు. ఈమెనేమో శుల్కం పుచ్చుకొని అమ్మడానికే ఇంతకాలంపెళ్ళిచేయకుండా ఉంచారట. ఇప్పుడాదురాచారం తప్పింది. ఈఅమ్మాయిసంగతిచెవుతూంటే చుట్టూజనంమూగి అందరికీ తెలిసిపోబట్టిగాని, రహస్యంపేలయితే చేరదీసేవారేమో ! ఈమెకూడా అంతకఠినులయిన తల్లిదండ్రులవద్ద ఉండేకంటె మానరక్షణచేసిన తమ సన్నిధానాన్ని ఉండడమే గౌరవప్రదంగాభావిస్తున్నది. అందుచేత మనకుటుంబంలో ఉంచుకోడమే కర్తవ్యం.

వాసు : చాలా సంతోషం. రాఅమ్మా! నువ్వు స్వేచ్ఛగా నీయిష్టం వచ్చిన పని చేసుకో!

వెంక : ఈయమ్మపేరేటిబాబూ?

రామం : జానకీదేవి.

వెంక : సీతామ్మ వోరన్నమాట. మనం రాములవోర్ని సూడాల.

వీరన్న : సిన్నబాబుపేరు రాములోరే గందా!

వాసు : రామం! ఇవాళ రైలు ఆలస్యంగా వచ్చిందా! ఇంతసేపయిందేం?

రామం : రైలు వేళకేవచ్చింది. తోవలో కొంతపరాభం జరిగింది.

వాసు : అదేమిటి?

రామం : రాత్రి రెండుగంటలకే రైలుదిగాం. అర్ధరాత్రి వేళ ఇక్కడికి యుకాయకీనిరాడానికి వీలులేక డాక్టరు వసంతా బాయిగారింటికి వెళ్ళాం. అరగంటసేపు నోరు నొప్పిపెట్టే లాగ పిలిచినా తలుపు తీయలేదు. ఆఖరుకి తలుపు తీశారు కాని ఒక్క క్షణమైనా మే మక్కడుండడానికి వీలులేదని పొమ్మన్నారు.

వాసు : కారణం?

రామం : నావంటివాడికి తనయింట్లో స్థలమివ్వడం పరువు తక్కువని కాబోలు.

వాసు : సోదరికైనా స్థలం యిమ్మన లేకపోయావా?

రామం : మాట్లాడడానికి అవకాశం లేకుండా వెంటనే తలుపు వేసుకొని ఇంట్లోకి వెళ్ళిపోయారు. మళ్ళా స్టేషనుకి పోయి ఆచలిలో అక్కడే తెల్లవారేవరకూ ఉండి వచ్చాం.

వాసు : నువ్వక్కడకు వెళ్ళకుండా మాయింటికే వెళ్ళ లేక పోయావా ?

రామం : అర్ధరాత్రివ్వుడు బాబయ్యగారికి నిద్రాభంగ మనిజంకాను. ఆడపిల్లగదాఅని ఈమెనయినా ఆదరిస్తారేమో అని ఆశపడ్డాను. పొరపాటే !

వాసు : సరే ! నువ్వు నాకు కొన్ని ఉత్తరాలు వ్రాసి పెట్టాలి రా ! వసంతతండ్రిగారు కృష్ణారావుగారు ఒకవిష యమై ఉత్తరంవ్రాశారు; దానికి జబాబిస్తాను; నువ్వు స్వయంగా అందించాలి.

రామం : చిత్తం !

వాసు : వెంకటరెడ్డీ ! మీరంతా రండి ! మనం వెళ్ళి పశువులడాక్టరుగారికీ ఇంజనీరుగారికీ బసలవిషయమై ఆలో చించాలి. రాఅమ్మా ! జానకీదేవి !

[తక్కినవాళ్ళంతా వెళ్లిన తరువాత వాసు రామాన్ని వెనక్కిపిలిచి]

వాసు : ఆసామిమీద కేసుపెట్టించావా ?

రామం: లేదు. ఆరాత్రిపూట పోలీసుస్టేషనులో ఫిర్యాదు తీసుకొనేవారెవరూ లేకపోయారు. రైలుకి వేళయిపోవడం చేత ఫిర్యాదుచేయకుండానే వెళ్లిపోయాము.

వాసు : అర్ధరాత్రివ్వుడు హత్యజరిగినా ఇంతేనా? కాంగ్రె సువారి ప్రభుత్వంలో పోలీసు శాఖాపరిపాలన ఇలాఉందన్న మాట ! పద ! (వెళతారు) తెర.

ఓం

బ్రహ్మాకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదునాలుగవరంగము.

---

సమయం సాయంత్రం 5 గంటలు

[కృష్ణారావుఇల్లు. కృష్ణారావు నాగిరెడ్డి మాట్లాడుకుంటూ వచ్చి కుర్చీలమీద కూర్చుంటారు. నాగిరెడ్డి బ్లేజర్ కోటు, సిల్కుపంచె-ఫెజ్ టోపీధరించి ఉంటాడు.]

కృష్ణా : దీనికీ, చూశావా! ఏమీ కష్టంలేదు. వానరమూకలాగ కాంగ్రెసువాళ్ళంతా పనిచేస్తారు. భూనభోంతరాళాలు గింగురుమనేలాగ 'వోట్ ఫర్ కాంగ్రెస్' (Vote for Congress) అనే ధ్వని తప్ప మరొకటి వినబడదు. ఇంక ఓటింగంటావా, కళ్ళకి గంతలు కట్టేసినా సరే, మూలనున్న ముసిలిగుడ్డిముండ కూడా పచ్చపెట్టె ఎక్కడుందా అని తడుముకుంటూ వెళ్ళి ఓటు దానిలో పడేస్తుంది. తిరపతి వెంకటేశ్వర్లముడుపులాగ, కుంకమూ, పసుపూ, ఫలాలు పుష్పాలు పట్టుకొని వెళ్ళి చేతులు జోడించుకొని పచ్చపెట్టెల్లో ఓట్లు పడేస్తున్నారు. తెలుసునా? నువ్వెందుకలా జడుస్తావు?

నాగి: ఇదివరలో తాలూకాబోర్డుకెళ్ళి తినిపడిపోయినాం కదండీ? ఆదెబ్బ అదటు వదల్లేదండి.

[రామంవచ్చి చాటున నిలబడి వింటాడు]

కృష్ణా: తాలూకాబోర్డుకు పెట్టినట్లు దీనికి ఇరవైవేలూ పాతికవేలూ ఖర్చు అక్కరలేదయ్యా! ఒక్క అయిదువేలు పట్టుకుంటేచాలు. ఇప్పుడంతా కాంగ్రెస్‌హయామ్. మంత్రులంతా మన స్నేహితులే! ఎక్కడపడితే అక్కడ చూశావా కాంగ్రెసువిజయదుందుభులు ఎలా మోగుతున్నాయో!

నాగి: నేను నిలబడితే కాంగ్రెసువాళ్లు అంగీకరిస్తారా అండి?

కృష్ణా: ఆపని నాకు విడిచిపెట్టేయ్! ఇవాళనుంచీ ఈవిదేశీగుడ్డలు వదలీ! వాటిని కాల్చేయక్కరలేదు. మీవాళ్లెవరేనా కట్టుకొనేవాళ్లుంటే ఇచ్చేయ్!

నాగి: మావాళ్లెవరూ ఈగుడ్డలు కట్టుకొనేపాటివాళ్లు లేరండి.

కృష్ణా: అయితే మామేనల్లుడు కలక్టరుకచేరీలో గుమాస్తాగా ఉన్నాడు. వాడికిచ్చేయ్! కళ్లకద్దుకొని మరీ కట్టుకొంటాడు. నువ్వుమాత్రం ఒక్క ఏభయిరూపాయల ఖద్దరుకొను! ఏం! కాంగ్రెసుప్లెడ్జిమీద దస్కతు చేసేయ్! అంటే ప్రమాణం అన్నమాట!

నాగి: ప్రమాణికాలు కూడా సెయ్యాలేటండి?

కృష్ణా: ప్రమాణమంటే, దేముడుగుళ్లో దీపమార్పి, నెత్తిమీద రామాయణం పెట్టుకొని, గంగలోదిగీ, ప్రమాణం చెయ్యక్కరలేదు. కాంగ్రెసులోచేరుతున్నానుఅని ఒకకాగితంమీద దస్కతు చెయ్యడమే?

నాగి: దస్తావేజు కాదు కదాండి?

కృష్ణా: అబ్బే! దరఖాస్తులాంటిదయ్యా! ఏముంది నాలుగు రోజుల్లో నామినేషను దాఖలయి పోతుంది. ఇంక ఎలక్షనంతా మామూలే!

నాగి: ఏటోనండి! క్రిందటితూరి తాలూకాబోర్డు ప్రెసిడెంటుకీ ఇలాగే దగా అయింది. డబ్బంతా తినేసి ఓట్లు పైగా ఇచ్చేసినారండి.

కృష్ణా: అయితే నాసంగతింకా నీకు తెలియలేదన్న మాట! నాకున్న పలుకుబడి, పెత్తనం, అధికారం, నీకు బోధ పడలేదు. ఈజిల్లాలో కాంగ్రెసుఅంతా నేను 'నిలబడు' అంటే నిలబడుతుంది 'కూర్చో' అంటే కూర్చుంటుంది. ఏమంటావు? నిన్ను జిల్లాబోర్డుకు ప్రెసిడెంటుగా చేసే పూచీ నాది.

నాగి: ఆయెనకనుండి మళ్ళీమాకాంగ్రెసులో నువ్వు పనికి రావు; జైలుకివెళ్లినవాళ్లే ఉండాలి; అని ఎవరేనా అడ్డుపెడితే మంచిమాట కాదండి.

కృష్ణా: నాలుకా తాటిపట్టా! ఏభయిమంది బోర్డుమెంబర్లూ జయలుకి వెళ్లిన వాళ్ళే ఉంటారా? నిన్నమొన్నటి దాకా జస్టిస్‌పార్టీలోఉన్న మొనగాళ్ళంతా రావుబహద్దర్ దివాన్‌బహద్దర్ బిరుదులు కూడా వదులుకొని ఆరోజు కారోజు క్రొత్తగా ఖద్దరు దీక్షపుచ్చుకొని ఎన్నికలలో అఖండవిజయం పొందినవాళ్లు అనేకమంది ఉన్నారు. ఏం?... రేపటికైనా లెఖ్ఖ జాగ్రత్త చేస్తావా?

నాగి: నాభార్యపేర నూరెకరాల మడిసెక్క మిగిలిందండి. దానిమీదే తంటాలుపడాల.

కృష్ణా: ఇంతేనటయ్యా! వెయ్యెకరాల భూమీ నూరు ఎకరాలలోకి వచ్చిందీ?

నాగి: ఆమద్దిని సినిమాలు తీయించినాను కానండీ! మరి, ఆయెనక బస్సులుపెట్టానా! నాటకాలు టోలుగేటు కంట్రాక్టులు కొన్నాళ్ళు చేశామండి. అంతా యాభై అరవై వేలు దెబ్బండి.

కృష్ణా: అలాగుటయ్యా! ఏముంది! ఒక్క ఏడాదిలో జిల్లాబోర్డులో లాగేస్తావు. ఈసంవత్సరం, ఇస్కూళ్ళు, ఆసుపత్రులు కట్టించడపుపని చాలాఉంది. ఏటిబ్రిడ్జీ ఒకటిపెద్దపని.

నాగి: కాంగ్రెసువాళ్ళకీ కంట్రాక్టులలో రామీ ఉంటుందాండి?

కృష్ణా: కాంగ్రెసువాళ్లుమట్టుకు మనుష్యులుకారటయ్యా! దానికిమార్గాలు నేనుచెపతానుకాదూ! ఇస్కూళ్ళలో పెట్టించే పుస్తకాలలోనే నాలుగైదువేలు కస్పీ! మరేమంటావు?

నాగి: అందాకా రెండువేలకి రైటుచేయించండి.

కృష్ణా: ఏమిటయ్యా బేరాలాడుతావు? నిలువెత్తు ధనం పోసినా నీకు పచ్చపెట్టివస్తుందా? నేనావిషయంలో ఎంత శ్రమపడాలో తెలుసునా?

నాగి: నిజమేకానండి, మరినానంతకంటె సాగలేనే!

కృష్ణా: సరే! రేపు కాంగ్రెసుప్లెడ్జిలో దస్కతుచేసీ! ఇవాళ్టనుంచీ ఈగుడ్డలు విప్పేసి ఖద్దరు కట్టాలి.

నాగి : ఉన్నకాడికిలా పోసేండి. ఈసారి కొత్తవి కొన్నప్పుడు కద్దరేకొందాం!

కృష్ణా : చంపేశావు! ఇలాగయితే చాలాప్రమాదం! నాకు కూడా మాటొస్తుంది. చూడూ! ఇంట్లో ఉన్నప్పుడెలాగున్నా, వీధిలోకి వచ్చినప్పుడయినా కాస్త ఖద్దరుతో కనబడాలి. (రామం, కృష్ణారావు ఎదుటికివస్తాడు. కృష్ణారావు నిర్ఘాంత పోయి, సముదాయించుకొని, నాగిరెడ్డితో) దేశంలోనుంచి కోట్లకొద్దీ విదేశీబట్టలకి ధనప్రవాహం వెళ్ళిపోతూంటే, నీవంటిరైతులు స్వయంగా తయారుచెయ్యడం పోయింది సరికదా, ఖద్దరు కట్టడమేనా లేకపోతే ఎలాగ? నాదేశం, నాబట్ట, నాతిండి, అనే భావం ప్రతి భారతీయుడికీ కలగాలి. మేము నోరు నొప్పెట్టేలాగ ఇంకా ఎన్నాళ్ళీ ప్రబోధం? చచ్చేదాకా ప్రబోధమే అయితే ఆచరణ ఎప్పుడు? మరి వెళ్ళు! రేపు ఉదయమే కలుసుకుందాం!

నాగి : చిత్తం! సెలవండి!

కృష్ణా : [రామాన్నిచూసి] ఇదిగో! భాగ్యవరం నుంచేనా? రా! కూర్చో! వాసు బాగున్నాడా?

రామం : (నిలబడే) చిత్తం!

కృష్ణా : పూర్తిగా వ్యవసాయంలో మునిగిపోయాడు కాబోలు! ఇతరప్రపంచమంతా మరచిపోయి.........

రామం : వారి ఉత్సాహానికీ కార్యదీక్షకీ పరిమితిలేదు.

కృష్ణా : ఒకసారి అక్కడిరైతులందరినీ ఆచుట్టుపట్లవా

శ్రేనీ పోగుచెయ్యకూడదూ? సామ్యవాదం గురించి నేనొక లెక్చరిస్తాను.

రామం: అక్కడ రైతులకి ఉపన్యాసం అక్కరలేదండి. అన్నయ్యగారే ప్రత్యక్షంగా వారికి సామ్యవాదం ప్రదర్శిస్తున్నారు.

కృష్ణా: అదేమిటి? అతనికంతా గ్రామసంఘాలూ పరిశ్రమలేకాదూ! వాసు సామ్యవాదంకూడా బోధిస్తున్నాడూ?

రామం: వారు ఉపన్యాసం ఇవ్వరండి. తమ ఆధ్యాత్మిక జీవనంవల్ల జ్ఞానసౌరభం వెదజల్లుతారు.

కృష్ణా: అంటే?

రామం: గులాబీపువ్వు వాసన నాలుగు దిక్కులకీ ప్రసరించడానికి ఉపన్యాసమెందుకండీ? ఆలోచన ప్రకటించడానికే భాష కాని అనుభవం ప్రకటించడానికి జీవితమే సాధనం.

కృష్ణా: ఏమిటంతా వేదాంతంచెప్పకొస్తున్నావు.

రామం: విశ్వప్రేమ, స్వార్థరాహిత్యం, ఆత్మనిరోధం అన్నయ్యగారు తమజీవితంద్వారా ప్రకటిస్తున్నారు. వారు చేసే ప్రతికార్యంలోనూ ప్రేమప్రవహిస్తుంది. ప్రజలు ఆప్రేమామృతంలో ముగ్ధులౌతున్నారు.

కృష్ణా: నీఉపన్యాసం ఒక పెద్ద అడ్వర్టయిజుమెంటులాగుందే!

రామం: ప్రతిమానవుడు తన అనుభవప్రమాణాన్నిబట్టే ప్రపంచాన్ని చూస్తూఉంటాడు.మీరలాగఅనుకోడంసహజమే!

కృష్ణా : నువ్వు చెప్పదలచుకొన్నదేదో నాకు తెలిసే లాగ టూకీగా రెండుమాటల్లో చెప్పు! ఊరికే గోడవ పెట్టక!

రామం : ఆత్మసాక్షాత్కారం, సత్యప్రతిష్ఠా, కలవారు మాట్లాడసక్కరలేదండి. అరవింద యోగి ప్రపంచానికి దర్శన మివ్వడమే సంవత్సరానికి రెండుసార్లు. అట్టివారి మహత్వమే జీవకోటి నాకర్షిస్తుంది. గాంధీజీ వంటి మహాపురుషుల దర్శ నార్థం లక్షలకొద్దీ జనం గుమికూడడాని కిదే కారణం. శ్రీకృ ష్ణుని వేణుగానంలో స్త్రీలు, పురుషులు, జంతుజాలము ముగ్ధులైపోడానికి ఇదేకారణం. పూర్వం మహారణ్యాలలో క్రూరమృగాలు ఋషీశ్వరులకి వశమవడానికీ ఇదేకారణం. జీవితానికున్న మహత్తు ఉపన్యాసానికి లేదండి.

కృష్ణా : అయితే మీవాను అంతవాడని దండోరా వేయ డానికి వచ్చావా ?

రామం : దయాసత్యధర్మాలఫలితం మానవసేవ. వారి సేవాపరత్వమే ప్రజలనాకర్షిస్తుంది.

కృష్ణా: మీగ్రామంలో ఉపన్యాసం ఏర్పాటుచెయ్యమంటే ఈపురాణం అంతా ఎందుకు ?

రామ : ఆచరణశుద్ధిలేని ఉపన్యాసానికి ఫలితం మిరియాల దండుగ. కార్యకారణవిమర్శ లేని ఉపన్యాసాలిస్తే నోటి తుంపరలే మిగులు.

కృష్ణా : నాఉపన్యాసం నిష్ప్రయోజకమనీ వట్టి కంఠశోషనీ నీఅభిప్రాయమయినట్లుంది. నామీాద దుష్ప్రచారానికి బయలుదేరావా ?

రామం : తోటమాలీగా ఉన్న మాలముండావాడిని ఇంటి గుమ్మం తొక్కడానికి అర్హత లేదని గొడ్డును బాదినట్లు బాది పనిలోనుండి తొలగించారు. అతనికి చికిత్సచేయమంటే ఆమడదూరంనుంచే కన్నెత్తి చూడకుండా పారిపోయారు మీఅమ్మాయిగారు.

కృష్ణా : ఎవరికారణాలు వారికుంటాయి. తగుమనిషి మొహం ఎదుట నిర్భయంగా దుష్ప్రచారానికి వచ్చినట్లుందే !

రామం : మీకు కోపం వస్తే తోటమాలీని కొట్టినట్లు కొడతారు అంతేనా? నేను వచ్చిన పనుంది. అన్నయ్యగారు మీకీఉత్తరం ఇమ్మన్నారు. ఇంకొక్కమాట చెప్పేసి......

కృష్ణా : చెప్పక్కరలేదు. ఆఉత్తరం అక్కడ పడేసి వెళ్లు.

రామం : ముఖ్యంగా చెప్పవలసిన మాటే ఇది. ఇంటి దొంగను ఈశ్వరుడైనాపట్టలేడన్నారు. మీవంటివారుకొందరు కాంగ్రెసుసంస్థలో చేరి దానికి కళంకం తెస్తున్నారు. దాని పేరుమీదుగా మీపేరు ప్రతిష్ఠలు చెలామణీ చేసుకుంటున్నారు. దానిని నడిపిస్తూన్న మహాపురుషులు ధృవతారల్లాగ యశఃకాంతులు వెదజల్లుతూంటే వారి తేజస్సుకూడా మరుగు పరచే మబ్బులు మీరు. కాంగ్రెసుధనం కైంకర్యం చేసేవారు, స్వలాభావకాశం తప్పితే పరపక్షంలో చేరేవారు, స్వదేశీ ప్రదర్శనాలతో స్వంతపోషణ చేసుకొనేవారు, దేశసేవికలతో దాంపత్యానికి దారిచూసుకునేవారు, కాంగ్రెసు ధ్వజంక్రింద తలదాచుకుంటున్నారు. అటువంటి మీరంతా పవిత్రమయిన ఆమహాసంస్థనుండి సాధ్యమయినంత త్వరలో తప్పుకుంటే

మంచిది. పవిత్రమయిన ఆఖద్దరు వస్త్రాలు గాంధీటోపీ ధరించడానికి మీాకు అర్హతలేదు. కాంగ్రెసు గోత్రికులలో మీావంటి విభీషణాయలున్నారని తెలిస్తే గాంధీమహాత్ముడు ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చేస్తాడు. ఇదిగో ఉత్తరం; ఆరెడ్డిదగ్గర రెండువేలు తొందరగా సంపాదించండి. మీాఅమ్మాయి పెళ్ళిఖర్చులకేనా పనికివస్తుంది. [ఉత్తరంపడేసి వెళిపోతాడు. కృష్ణారావు వణుకుతూ ఉత్తరంతీసి చదువుకొనికోపం పరాభవమూ చూపిస్తూ] వసంతా! వసంతా! [వసంత వస్తుంది.]

కృష్ణా: వాసు మనసంబంధం అక్కరలేదని జబాబు వ్రాశాడు.

వసం: అక్కరలేదనే? కారణం ఏంచెప్పాడు?

కృష్ణా: మీాయిద్దరికీ ఆదర్శాలు భేదించాయట! అసలు కారణం అదికాదేమోలే! అప్పన్నగాడికి నువ్వు మందివ్వలేదనీ, నిన్నరాత్రి వచ్చినవాళ్ళకింట్లో బస ఇవ్వలేదనీ, ఇలాంటివేవో ఉంటాయి.

వసం: దానికీ దీనికీ సంబంధమేమిటి? చదువుకున్నవాడు గదా! ఏవిషయానికావిషయం ఆలోచించాలి గాని అన్నిటికీ ముడిపెడితే ఇతని చదువెందుకూ?

కృష్ణా: అతడు చాలాగొప్ప వాడట! అరవిందయోగి అంతవాడట! గాంధీఅంతవాడట!

వసం; ఆమాాఎవరన్నారు?

కృష్ణా: అతని తమ్ముడినంటూ ఒకడున్నాడు కాడూ?

వాడే తెచ్చాడీ ఉత్తరం. నాదంతా ఆచరణలేని దొంగసామ్యవాదమట! ఇంకా ఏమిటేమిటో పేలాడు.

వసం : ఫూల్! వాడే చేశాడీ పని! ఈకొండేలు వాడే చెప్పి ఉంటాడు. రోగ్ అండీ వాడు. మొట్టమొదటరోజున వాడిని చూసినప్పుడే గ్రహించాను. ఆపిల్లనెవర్తెనో వెంటబెట్టుకొని వచ్చాడు కాడూ! ఆసంబంధంలో ఏవో చాడీలు చెప్పి మనస్సు విరిచేసిఉంటాడు.

కృష్ణా : ఇతడు చెప్పినంత మాత్రాన చెప్పాడుమాటలు విని నమ్మేస్తాడా వాసు?

వసం : నమ్మేస్తే నమ్మేసే ఉంటాడు. అతని కీవ్యవసాయంలో పడిన దగ్గరనుండీ బుద్ధి మన్నయి పోయిందండీ! ఓదర్జా, మర్యాదా, డీసెన్సీ అన్నీ పోయి ఉత్తి మొరడై పోయాడు.

కృష్ణా : ఇప్పుడారంభించి ఇంకోప్రయత్నం ఎలాగ చేసుకోడం! నీకు పాతికేళ్లు వయస్సు వచ్చిన తరువాత తగిన సంబంధం లభించాలంటే మీాదమీాదుందా?

వసం: ఎంత తెలివయినవాడయితే ఏంలాభం! ఎంత మంచి మనస్సయితే ఏంలాభం! బూడిదలో పోసిన పన్నీరయింది.

కృష్ణా : ఇతన్ని ఇలా ఊరుకుంటే కాదమ్మా! బాగా ఏడిపించి కాళ్ళమీాద పడేలాగ చెయ్యాలి.

వసం : పదిపన్నెండేళ్ళ స్నేహం ఒక్కసారి తుంచేశాడు. ఎంతమెత్తని మనస్సు పాషాణమై పోయింది?

కృష్ణా : చిన్నప్పటినుంచీ అతనిమీద మనమింత ఆశ పెట్టుకొని ఉన్నాం గదా! తడిగుడ్డతో పీక ఉత్తరించాశాడే! నీజీవితం పాడుచేసి గంగలో కలిపాడే!

వసం: ఎంతటిలో వెన్నెల చీకటయి పోయిందీ?

కృష్ణా : నువ్వు కనికరిస్తే లాభంలేదు. నీకు శాశ్వతమైన అపకారం చేశాడా? ఇతన్ని ఏంచేసినా పాపముందీ?

వసం : మీరొక్కసారి ఆఖరుప్రయత్నంచేసి చూడరాదూ నాన్నగారూ!

కృష్ణా: నేనా! ఈపరిస్థితులలో నేనతని ఎదుటికి వెళ్ళడమే! రామమే అనేశాడు మొహం వాచీలాగ నాలుగు మాటలూను. అతని ఎదుటపడితే ఇంకా నాభవిష్యం ఉంచుతాడా?

వసం : పోనీండి, రేపుఉదయం నేనే వెళ్ళివస్తాను. ఆఖరుప్రయత్నం చేసి చూస్తాను.

కృష్ణా : నీయిష్టం; వెళితేవెళ్ళు! అంగీకరిస్తేసంతోషమే! కాని నాకుమాత్రం ఏమీ నమ్మకం లేదు. [రోడ్డువైపు చూచి] అదుగోనమ్మా! వాళ్ళ మేనేజరు! అలా వెళుతున్నాడు. అతనితో బుజం కలిపామంటే వాసునేడిపించడం క్షణంలో పని. పిలిచి కదిపి చూస్తాను. నువ్వింట్లోకి వెళ్లు!

[వసంత దుఃఖంతో ఇంట్లోకి వెళుతుంది. కృష్ణారావు వీధిలోకి వెళ్లి గోపాలంతో కలిసి వస్తాడు.]

కృష్ణా : నాదగ్గర దాచకండి. మీచాకచక్యం తెలివి

తేటలూ నేనువింటున్నానుకానూ! సిద్ధసంకల్పులు. తలచుకుంటే పని జరిగిందన్నమాటే! మా... అమ్మాయిని—ఎప్పుడేనా చూశారా?

గోపా: చూడకేం! ప్రాక్టీసుకూడా చాలా వాడుకగా ఉందని వింటున్నాం.

కృ: లక్ష్మీపతిగారికి మీరు అన్నిరకాలవైద్యాలు చూశారుగదా! ఒక్క నెల్లాళ్ళపాటు మాఅమ్మాయిచేత మందిప్పించి చూడండి!

గోపా: మీఅమ్మాయి వారికోడలేనని ఊరంతా చూమరుగా ఉంది.

కృష్ణా: అబ్బే వుట్టిపుకారు. ఇదిగో పులి అంటే అదుగో తోక అంటారు. కొన్నాళ్ళు ఆఉద్దేశముండేది కాని, ఈమధ్య అతను బొత్తిగా గౌరవం మర్యాదా లేకుండా ఆరైతు వాళ్ళతో పాటలుపాడుకుంటూ తిరగడం చూసి మాఅమ్మాయికి అసహ్యంవేసి విడిచి పెట్టేసింది.

గోపా: అలాగుటండీ! ఇహ అయింది లెండి. వారినాన్నగారికి కూడా అసహ్యం పుట్టింది. ఇంక కానీ ఇవ్వరు.

కృష్ణా: అతన్ని బాగుచేసిన వారవుతారు... అన్నట్లు మీకీమధ్యని కళత్రలోపం జరిగిందనివిన్నాను.

గోపా: అవునండి. అంతా ఆరునెల్లయింది.

కృష్ణా: పాపం! మొన్నమొన్నటివరకూ నాకు తెలియనే లేదు సుమండీ! ఇంత అధికారం చేతిలో పెట్టి సంసారసౌఖ్యం

లేకుండా చేసిన అభగవంతుడి ననాలి...మళ్ళా ఏదయినా ప్రియత్నం...

గోపా: కట్నాలిచ్చి పిల్లనిస్తామని ఎంతోమంది వస్తున్నారు. అయితేనేం నచ్చినవాళ్ళెవరూ లేరు.

కృష్ణా: అలాగేమరి! పెద్ద ఎస్టేటు చేతులమీద నడుస్తూన్నప్పుడు లాకలూకాయి సంబంధం ఎలాచేసుకుంటారు?

గోపా: ఏమిటోనండి! ఈప్రాణి సుఖానికి నోచుకోలేదు. తమరు సెలవిచ్చినట్లు ఈఒక్క చిటికెనవేలు సంజ్ఞతో ఇంతఎస్టేటు ఎలాపడితే అలా ఆడించగలను. ఈమధ్య మాప్రొప్రయిటరుగారికి వారబ్బాయిమీద కోపంవచ్చి అతనికి ఆస్తిలో హక్కులేకుండా చేయడమే కాకుండా ఆస్తి అంతా నాకు దానపట్టాగా కూడా వ్రాసి యిచ్చేస్తానన్నారు. ఎందుకు మహాప్రభో! నేను భరించలేనన్నాను. ఏనుగు వచ్చిందనగానే దొడ్లో కట్టెయమంటే సరా! యోగంపట్టినప్పుడు అనుభవించే వాళ్ళు ఉండొద్దూ!

కృష్ణా: ఆపని చేయిద్దురూ! అతని తెగులణుగుతుంది. ఆపనే నిజంగా మీరు చెయ్యగలిగితే ఇదిగో! (చెవిలోరహస్యంచెప్పి) ఇదే ఖాయం. మీరీమాట పిట్టమనిషితో అనకూడదు. నేనెంతో బ్రహ్మప్రయత్నంచేసి మాఅమ్మాయిని ఒప్పించాలి.

గోపా: తమవాక్యం అమోఘం.

కృష్ణా: మీరారెండుముక్కలూ, అతనికి ఆస్తిలో హక్కు లేనట్లూ, మీపేర దానపత్రా, ఒక్కస్టాంపుమీద వ్రాయించేసి మాఅమ్మాయికి చూపెట్టండి. తక్కినదంతా నేను రైటు చేస్తాను.

గోపా: ఓ! నిమిషాలమీద చేస్తాను. దానికీలకం నాచేతిలో వుంది. తమదర్శనం అవడం ఈశుభమొకటి; ఇవాళ చాలా అదృష్టం.

కృష్ణా: మంచిది. నేనుంటాను బాబూ! వైద్యం మాట కూడా మరచి పోకండి.

గోపా: చిత్తం—విధిగాను. మళ్ళా మరచి పోవడమే! శలవు.

(కృష్ణారావు దిగబెడతాడు.)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదునైదవరంగము.



సమయము - ఉదయము 8 గంటలు.

కర్మ: పాట:- కర్మవీరుని సంచారప్రదేశము.

తెలుగుపొలములో బంగరుపంట,
తెలుగుకత్తిలో మునుపటిపదును
తెలుగుపల్లెలో తరగనిపనులు
నెలకొల్పుము నీ వాంధ్రపుత్రుడవయితే ||ఆంధ్రమాతృ||

సీ|| తమిళకర్ణాటబంధములూడ్చి తెల్గునీ
మనసు స్వాతంత్ర్యమ్ముగా మార్చువరకు,
రాష్ట్రనిర్మాణకార్యము, నివార్యమటంచు
మప్పువారికి బుద్ధిచెప్పువరకు
ఒడ్డెమాగాణమందొదిగి పేర్వాసిన
తెలుగుఖండము నెల్ల దెచ్చువరకు
బళ్ళారిలో నాంధ్రభాగమంతయు జీల్చి
తెలుగురాజ్యమ్ములో గలుపువరకు
ఇదియునదియని లెక్కింపనేల, యావ
దాంధ్రవిషయమ్ము నొక్కరాజ్యమ్ము జేసి
పట్టి జయభేరిపై దెబ్బ గొట్టువరకు
తెలుగు పసిపాపకైన నిద్రింప దగునె|| (తుమ్మల)

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదునారవరంగము.

సమయము-ఉదయము 9 గంటలు.

(భాగ్యవరంలో వాసు పారిశ్రామికశాల. పలువురు పలువిధాల చేతిపనులు చేస్తూఉంటారు. రామం తక్లీమీద దారంతీస్తూ ఉంటాడు. ఆంధ్రరాష్ట్రపటం, ఆంధ్రనాయకులపటాలు, ఆంధ్రమాతపటంఉంటాయి. కోఆపరేటివు ఇన్‌స్పెక్టరు అయ్యంగారు ప్రవేశం. కోటు, నెక్‌టయి, గూడకట్టు, పంగనామాలు.)

రామం: (లేచి) ఓహో! కోఆపరేటివుఇన్స్పెక్టరుగారా! నమస్కారం! దయచేయండి.

అయ్యం: (కూర్చుంటూ!) వాసుదేవరావు గారెక్కడ?

రామం: వస్తారు. వారు ఇక్కడ పరపతిసంఘమొకటి స్థాపించాలనుకుంటున్నారు. ఆవిషయంలో మీసలహా కోరి మీకు శ్రమఇచ్చారు.

అయ్యం: ఏమండీ! మీరంతా దండిగా పనులుచేయిస్తున్నారే!

రామం: ఇదంతా ఆంధ్రోద్యమం. [పరిశ్రమలుచూపిస్తూ]

అయ్యం: ఏమిసార్! ఎక్కడచూస్తే అంద్రరాష్ట్రిందా సెప్తారే! తిరుపతి మీాది సెప్తారు. మదరాసు మీాది సెప్తారు.

ఇండియా అంతా మీదే నెప్పండిమీ ఒకేసారి! తంటాదా తీరిపోనే!

రామ: (సగర్వంగా) ఇండియా అంతా మాదే అనే రోజులు ఒకప్పుడుండేవి. ఆంధ్రులు అవతల పాటలీపుత్రం వరకూ యివతల కన్యాకుమారివరకూ రాజ్యాలు చేశారు తెలుసునా?

అయ్యం: ఎప్పుడో చేసినారో ఏమో! మీతాతకి తాతకి తాత, మాతాతకి తాతకి తాత, పుట్టినదానికి మునుగా; ఇప్పుడేమిప్రయోజనం అదంతాచెప్పి? ఇప్పుడుచూస్తే మీకే ముండాది? అయిదారు జిల్లాలు దానే?

రామం: మాకున్న జిల్లాలు అయిదారేనా? నూరేళ్ళకిందట మీతమిళులకి కుంభకోణం మాయవర ప్రాంతాలు దాటితే స్థానమేలేదు. కావలస్తే ఓరియంటల్ లైబ్రరీలో లోకల్ రికార్డులు చూసుకోండి.

అయ్యం: అంతవానా? తిరుచనాపల్లి, తంజావూరు, ఆర్కాడు, మధుర, కోయంబత్తూర్, చెంగల్పట్టు, సేలమ్, ఇదంతా మీఆంధ్రవాడు దుద్దుపెట్టి కొనిఉండాడా ఏమి?

రామం: ఆప్రాంతాలలో లక్షలకొద్దీ ఆంధ్రులు నివసించారు. ఒక్కసారి ఇది చిత్తగించండి తెలుస్తుంది. (ఆంధ్ర రాష్ట్రపటం చూపిస్తూ) ఇదిగో ఇవతల ఉత్తరాన్ని ఒరిస్సాలో చిలకాసరస్సువరకూ, మధ్యరాష్ట్రంలో బస్తరురాజ్యం చాందాజిల్లా, నైజాంలో సగానికి పైగాఉన్న తెలింగానా

అంతాను, దక్షిణాన్ని మైసూరులో, కోలారు, తుమ్కూరు, చిత్రదుర్గజిల్లాలు బెంగుళూరున్నూ, సేలంజిల్లాలో హొసూరు, కృష్ణగిరి, ధర్మపురి తాలూకాలు, చెంగల్పట్టుజిల్లాలో పాలేరునదికి ఉత్తరంగా ఉన్నదంతాను, ఇదంతా సమగ్రమయిన ఆంధ్రరాష్ట్రం; లక్ష పదివేల చదరపుమైళ్ళ వైశాల్యం; ఇరవైరెండుజిల్లాలు; రెండుకోట్ల డెబ్భయిలక్షల జనసంఖ్య; హిందూదేశంలో భాషాబాహుళ్యానికి ఆంధ్రులది మూడవస్థానం; డెన్మార్కు, గ్రీసు, ఐర్లాండు సిలోను కంటె ఎన్నోరెట్లు పెద్దది మాఆంధ్రరాష్ట్రం.

అయ్యం: అదిదా సార్ నాన్ చెప్పేది! ఇండియా అంతా ఆంధ్రరాష్ట్రం చెప్పండిమీ! ఎక్కడెక్కడ జర్మనీవాడుంటే ఆదేశమంతా రీచ్‌లో చేరిపోవాలిదా చెప్తాడే హిట్లరు. ఆమాదిరిదా ఉంది.

రామం: మీకు మాత్రం సప్తసముద్రాలు సాంబారయి పోవాలి కాబోలు. సిమ్లానుంచి రంగూన్‌వరకూ, సేతువు నుంచి హిమాచలంవరకు సీమనేపాళంలాగ మీరువ్యాపించి పోవాలి? జావా సుమిత్ర, సింగపూర్ దక్షిణాఫ్రికాలలో కూడా మీవిత్తనం పాకిపోవాలి?

అయ్యం: మేము ఉండేదంతా తమిళరాష్ట్రం చెయ్య వలసిందిదా చెప్పలేదే మీమాదిరి.

రామం: మీకు వేరేరాష్ట్రమెందుకు? అన్నిరాష్ట్రాలూ మీవే! అమెరికా కనుక్కోడానికి కొలంబసు బయలుదేరితే

అక్కడ ఒక అరవకాఫీహోటలు కనబడిందట!

అయ్యం: ఆంధ్రవాడు కాఫీహోటలు ఎందుకు పెట్టడు సార్! మనం ఇంట్లోదా కూచుకోవలె! ఇల్లు కదిలిపోయే దానికి రొంబబయం! మాది ఆమాదిరి లేదు. ఒకరూపాయి జాస్తీ వచ్చిందంటే పాలఘాట్ నుండి రంగూన్ పోతాం.

రామం: ఆంధ్రులడబ్బంతా అరవదేశంలో మెట్టూరు పయకారా పోజెక్టులకి పెట్టేసి దోచుకోడమే కాకుండా ఇడ్లీసాంబారుకింద వేలకొద్దీ డబ్బు లాగేస్తున్నారు. ఆసాంబారులో వశీకరణౌషధమేమయినా కలుపుతున్నారో ఏమో! సాంబారురుచి మరిగాక మావాళ్ళు వదలలేక పోతున్నారు.

అయ్యం: మీది కూపస్తమండూగం! ఇంటిలోదా కూచుకోవలె! దుడ్డువచ్చి పడవలె! సాపాటు నాన్ చేసేది, కడుపు నీకు నిండేది. మీాఆంధ్రవాడికి కాఫీహోటల్ పెట్టేదికూడా తెలియదు.

రామం: అది మాత్రం నిజం! కాఫీహోటళ్లవ్యాపార దృష్టితో మీావాళ్లు సాగించినట్లు మావాళ్ళకి చేతకాలేదు. అథవా మావాడు కాఫీహోటలుపెడితే ఇద్దరు ముండలు బాంిందీబుడ్లు, ఊరంతా అప్పులు, మూడురోజులకి దివాలా!

అయ్యం: చూస్తిరా! ఏమిసార్! మనంమనం ఒకటిదా! తెలుగు తమిళం ఏమిబేదం? మనమంతా హిందువులు; మన కంతా రాముడు కృష్ణుడు దేవుడు; భరతమాత తల్లి.

రామం: పాపం! మేము విడిపోయి మాదారి మేము చూసుకుంటామంటే కణ్వమహర్షి పడినంత బాధ పడుతూన్న ట్లుంది మీరు.

అయ్యం: అట్లనా! మీరాయలసీమవారుదా మీతో పోట్లాడుతారే! ఆంధ్రరాష్ట్రం వద్దని చెప్పి వారు మదరాసు యూనివర్సిటీలో చేరిపోయినారుకదా!

రామం: అవి మీవంటివారి ప్రోత్సాహం వల్ల వచ్చిన విభేదాలు. ఇప్పుడు వారూ మేమూ కళ్ళు తెరచి సఖ్యపడి పోయాము. మీపుణ్యం ఉంటుంది. మళ్ళా నారదాంశ నటించ కండి! అనంతపురంలో వారికొక విశ్వవిద్యాలయం పెట్టి మదరాసు ఆంధ్రరాష్ట్రానికి రాజధానిగా చేస్తే వారికి కలహ కారణమే లేదు. తుంగభద్రా ప్రాజెక్టు తయారయితే రాయలసీమ సోదరులు రాళ్ళుకొట్టుకు బ్రతకక్కర లేదు.

అయ్యం: ఓహో! మదరాసుదా కావలె మీకు! పెద్దప్లానుదా వేస్తుండారే! మద్రాసు మీకు ఎట్లుదావచ్చును సార్?

రామం: మూడువందల ఏండ్లక్రిందట చంద్రగిరిరాజు ఆంధ్రులచెన్నపట్నాన్ని ఈస్టుఇండియాకంపెనీకి ఇచ్చాడు. ఆకంపెనీవారు చంద్రగిరిరాజుకు కప్పంగట్టినట్లు దస్తావేజు లున్నాయి. చెన్నపట్నం తమరు తయారుచేయలేదు. ఆంధ్రు లనేకులు తమసర్వస్వమూధారపోస్తే నేటి చెన్నపట్నమైంది.

అయ్యం: మరి, ఇప్పుడు చూడండిమీ! మదరాసంతా

ఏ ఆఫీసులో చూసినా తమిళవాడుదా! మదరాసులో తమిళ వాండ్లుదా నెంబరుజాస్తి!

రామం: శుద్ధ అబద్ధం! రాముడని పేరుచెప్పినా, రామన్ అని మీరు జనాభాలెక్కల్లోవ్రాసేస్తే, నెంబరు జాస్తీకాదూ? సరియైనజనాభాతీస్తే చెన్నపట్నంలో ఇప్పటికీ తెలుగువాళ్ళే ఎక్కువుంటారని రుజువుచేస్తాను. మద్రాసుకుదక్షిణంగా ముందుగా రైలుపడింది గనక మీవాళ్లు గబగబా పరుగెత్తుకు వచ్చి యింగ్లీషువారి దాస్యానికి పూనుకొని ఉద్యోగాలన్నీ ముందుగా ఆక్రమించారు. ఆంధ్రులు ఆరోజుల్లో చెన్నపట్నం వెళ్ళాలంటే స్టీమరుమీద మూడురోజుల ప్రయాణం పట్టేది.

అయ్యం: ఎందుకుసార్! ఊరికే గడబిడచేస్తూఉండారు. అంతా కలిసి ఉంటేదా బలం! విడివిడిగా పోతే ఏముంది? ఎప్పుడో అయిదువందలు ఆరువందల ఏండ్లకింద మీవాండ్లు పెద్దయుద్ధాలు రాజ్యాలు చేసినారు చెప్తారు. మనమేమి చూసినామా ఏమి? నేటిసంగతిదా చెప్పుకోవలె!

రామం: మంచి వేదాంతమే! ఆంధ్రులపూర్వప్రతిభ మీకు నమ్మకంలేదా? వింధ్యపర్వతాలకి దక్షిణంగాఉన్న యావత్తు దేశంలోను మొట్టమొదట రాజ్యం చేసినవా రాంధ్రులు. దక్షిణాపథంలో నాగరికతకీ, కళలకీ, మతరక్షణకీ విదేశీవాణిజ్యానికీ పునాది వేసిన వారు ఆంధ్రులు. మహారాష్ట్రులకు రాజనీతి గరపినవారు ఆంధ్రులని తిలక్ గారన్నారు. మీమధురలో తిరుమలనాయకుని రాజభవనం లేదు?

మీాతమిళుల సంగీతానికి భిక్షపెట్టిన త్యాగరాజు ఆంధ్రుడు కాడూ? శివకంచిని విష్ణుకంచిగాను, విష్ణుకంచిని శివకంచిగాను మార్చిన మహాతపశ్శాలి అప్పయ్యదీక్షితులు ఆంధ్రుడు కాడూ? మారఘునాధనాయకులు స్థాపించిన ఆంధ్రసరస్వతీ పుస్తకభాండాగారము ఇప్పటికీ అశోకవనంలో సీతలాగ తంజావూర్లో మూలపడి మూలుగుతూంది. ఈనాడు మారోజులు తిరగబడినాయి; మీారు దోచుకుంటున్నారు. పాలకులు పాలితులయ్యారు పాలితులు పాలకులయ్యారు.

అయ్యం : ఏమిసార్—అట్లాచెప్తారు ? దోచుకొనేదేమి ? నౌఖరీ చేస్తాం! సంబళం తీస్తాం! అంతదానే!

రామం : ఆంధ్రులడబ్బాంతా ఆంధ్రులకే ఖర్చుపెట్టకూడదూ? ఆంధ్రులకి అన్ని శాఖలలోనూ అరవలతో సరిసమానంగా ఉద్యోగాలివ్వకూడదూ? ఆంధ్రులవల్ల వచ్చేఆదాయంలో ఆంధ్రులకోసమే పెట్టే ఖర్చుపోగా ఏటా కోటిన్నర రూపాయలు మిగులుతున్నాయి. అది మీారు కాజేస్తున్నారు. ఈలెఖ్ఖని మీారు మాకు ఏన్నో కోట్లు బాకీపడ్డారు తెలుసునా? ఆంధ్రరాష్ట్రం రానీండి. ముక్కునులిపి పుచ్చుకుంటాం!

అయ్యం. సరిదా పోచ్చి! ఆనాటికి నాకు పించన్‌దా అయిపూడ్చును.

వాసు : (ప్రవేశం. అయ్యంగారు, రామం లేస్తారు. అయ్యంగారు వాసు ఒకరికొకరు నమస్కారాలు.) ఇన్స్పెక్టరుగారు దయచేశారా? ఇక్కడ గ్రామపరిశ్రమలు స్థాపించాం. రకరకాల పంటలు

పండిస్తున్నాం. ఈపరిశ్రమలకుపంటలకు పెట్టుబడి పెట్టి, తయారైన దినుసు, వస్తువులుచలామణీకాడానికి పూనుకొ నేపరపతిసంఘం స్థాపించాలి. ఈవిషయంలో మీసహాయం చాలా అవసరం.

అయ్యం: రిజిస్ట్రారుకి దరఖాస్తు పెట్టించండిమీ! మీపంటలు చేతిపనులు వివరంగా వ్రాసి పెట్టాలి.

రామం: డాక్టరు వసంతాబాయిగారు వస్తున్నారు.

వాసు: (చూచి) సరే! రామం! నువ్వు వీరితో వెళ్లి కావలసిన వివరాలిచ్చి దరఖాస్తుకి మసోయిదా వ్రాయించు నేనూ ఇప్పుడే వచ్చేస్తా!

[రామం అయ్యంగారు వెళతారు, వసంత ప్రవేశం.]

వాసు: ఏమి వసంతా! మాభాగ్యవరం మీద అపూర్వమైన కరుణాకటాక్షం కలిగింది!

వసంత: నాన్నగారికి లెటర్ పంపావు కాదూ?

వాసు: ఆ విషయంలో నీ మనస్సు నొప్పించినందుకు క్షమించాలి.

వసంత: పోనీ! నువ్వంత కఠినంగా వ్రాయడానికి తగిన కారణం చూపించ గలవా?

వాసు: నేనా ఉత్తరంలో వ్రాశానే! మనదృక్పథము మనస్తత్వాలు, ఆదర్శాలు పూర్తిగా భేదించాయని. ఈపరస్పరమైన అవిశ్వాసంతో శాశ్వతమైన దాంపత్యబంధనం ఏమిసుఖం?

వసంత: చిరకాలంనుండీ, మనబాల్యావస్థనుండీ, పెరుగు

తూన్న ప్రేమలతను మొదలంటా నరకడానికి నీకు చేతు లెలాగ వచ్చాయో నాకు తెలియకుండా ఉంది. మన చిన్న నాటి రోజులు జ్ఞాపకం తెచ్చుకో! విద్యార్థి దశ తలచుకో! ప్రతియేడు సెలవులలో మనం మహానందసాగరంలో ఈది గడిపిన దినాలు స్మరించుకో! మొన్న మొన్న నువ్వు వచ్చిన తరువాత ఈసముద్రతీరాన్ని చల్లగాలిలో మనం తిరిగిన సాయంకాలాలు అప్పుడే మరుపుకు వచ్చాయా? ఎన్నిసార్లు నన్ను నువ్వు, నిన్ను నేను స్పృశించలేదు. ఎన్నిసార్లు శృం గారసల్లాపాలు చేసుకోలేదు. సీతారాముల్లాగ భార్యాభర్తలం అవుదామని ఎన్నిసార్లు అనుకోలేదు.

వాసు: సీత మహాపతివ్రత.

వసంత: అవును. నేనుమాత్రం నీమాట కెదురు చెప్పాను. కాదూ? నీతో ఈపల్లెటూరిలో నివసించడానికి నిరాకరిం చాను. నువ్వు ఇచ్చినకొయ్యదువ్వెన తృణీకరించాను. ఇదేనా నాఅపరాధం? విధివశంవల్ల ఆపదలుకాని వస్తే నేను సీత కంటె ఆదర్శంగా నిన్ను అనుసరించే దాననే మో! ఊరికే ఉత్తపుణ్యానికి, తీరికూర్చుని, ఈకష్టజీవనం కోరి తెచ్చుకో వడం ఎందుకూ అంటున్నాను. లేక అనుభవించలేనివారు కొందరు, ఉండి అనుభవించలేనివారు కొందరూను. హాయిగా మహారాజభోగం అనుభవిస్తూ సుఖజీవనం చెయ్యమని ప్రార్థించాను. ఇదేనా నావల్ల తప్పు?

వాసు: మానసిక వికాసమే పెడదారి తొక్కింది.

వసంత : అవును. పెడదారి తొక్కిందికాదూ ? లేక పోతే ఈపతాం తొక్కడం, గొప్పతవ్వడం, నాగలిదున్నడం, ఎందుకొస్తాయి ? ఈముతకగుడ్డలు పిచ్చిపాటలు, కూలివేషం ఎందుకొస్తాయి? ఏదోమహాదర్శం సాధిస్తానని పట్టపగలు కలలు కనడం ఎందుకొస్తుంది ?

వాసు : ఈపిచ్చి నాకు మహానందమిస్తూంది. ఇది నాజీవితానికి ఆధారం అయిపోయింది. అహింసావ్రతం కోసం బుద్ధభగవానుడు, హిందూధర్మస్థాపనకోసం శివాజీ మహారాజు, దేశస్వాతంత్ర్యంకోసం రాణాప్రతాపసింహుడు ఇలాగే పిచ్చికలలు కని సఫలులయారు. స్వరాజ్యం కోసం గాంధీమహాత్ముడు ఇలాగే పిచ్చికలలు కంటున్నాడు. ప్రజల విమర్శలకు లక్ష్యపెట్టకుండా, పేరుకోసం తాపత్రయపడకుండా తాము పట్టిన దీక్ష సాగించారు ఆమహనీయులు. నేనుమాత్రం వారు చూపిన మార్గం త్రికరణశుద్ధిగా అనుసరించగల శక్తికోసం పరమేశ్వరుని నిత్యమూ ప్రార్థిస్తున్నాను.

వసంత : నాకింక నిరాశేనా ? నాజీవితం భగ్నమైనట్లేనా ?

వాసు : నిన్ని భాగ్యవరానికి రమ్మని మనసారా ప్రార్థించలేదూ ? ఈసేవారథానికి నీజీవితాన్ని రెండోచక్రంగా అనుగ్రహించమని కోరలేదూ? (గ్రామపరిశ్రమలుచూపిస్తూ) ఈలెక్కలేని పరిశ్రమలతో అలంకృతమయిన గ్రామసౌభాగ్యలక్ష్మి ఆహ్వానం అందుకోరాదూ ? ఆంధ్రదేశచరిత్రలో సువర్ణాక్షరాలతో మెరుస్తూన్న వనితారత్నాలకీర్తినువ్వభిలషించకూడదూ ?

సీ॥ విరిగివచ్చిన ప్రాణవిభునకు బసుపిచ్చి,
వేడినీళ్ళను తోడె కోడలొకతె
కత్తులతిరునాళ్ళ గవయ వచ్చిన సాధు
గోరకచ్చు నడి దోలె కూతురొకతె,
కులకక్షల గృశించి కూలనున్న విశాల
రాజ్యచక్రము త్రిప్పె రాణి యొకర్తు
కవికోకిలమ్ముదూక్తి సవదరించెను తేనె
నుడికారమున నాడుపడుచొకర్తె
విమలసాహససౌకుమార్యములు వెలయ
దిఙ్నితంబంబులందు చిత్రించినారు
తమచరిత్రల నాంధ్రరత్నములు నాడు
తలపవెట్టులాజాతిచైతన్య మతివ! (రాయప్రోలు)

[జానకి రాట్నం తెచ్చి వాసు ఎదుట పెట్టి వెళుతుంది. వాసు నూలు వడకడం ప్రారంభిస్తాడు. వసంత జానకివెంట దృష్టిసారించి]

వసం: ఈవిడెవరు? ఓహో! ఆవేళ అర్ధరాత్రిప్పుడు మాతలువు బద్దలు కొట్టిందీవిడేనా? మరేం! ఈవిడిక్కడ దాపురించింది? ఇప్పుడు బోధపడింది. నీఉత్తరమిప్పుడు పూర్తిగా అర్థమయింది. ఈవిడ నీకు కాబోయే రాణీ కాబోలు?

వాసు: చాలా పొరబడుతున్నావు. గ్రామజీవనమంతా అతిఆప్యాయంగా అలవర్చుకొని మాభాగ్యవరానికి నూతన శోభ తెచ్చిన జానపదకన్యక.

వసం: ఈపిల్ల దొరికిందని నన్ను నిరాకరిస్తావా? ఇంకొకరిని వివాహమాడమని నాకు సలహా ఇచ్చావు కదా! ఏనా

టినుండో నిన్ను ప్రేమించి, నామానప్రాణాలు నీకర్పించిన తరువాత నన్నిప్పుడింకొకరిని వివాహమాడమనడం నీకు న్యాయమేనా? ఇదేనా నీధర్మం? నాకు శాశ్వతమైన అపకారం చేశావు సుమా!

వాసు: వసంతా! చాలా విపరీతంగా అర్థం చేసుకొని అనవసరంగా ఆయాసపడుతున్నావు.

వసంత: ఇంక నేనేమివాదించి లాభం లేదా? నాప్రేమ, నిశ్చలమయిన నాప్రేమ, అవ్యాజమయిన నాప్రేమ గడ్డిపరకకయినా మారలేదా? నాప్రేమ దొంగిలించావు; నాఉత్సాహమంతాపీల్చి తాగావు! నన్ను జీవచ్ఛవాన్ని. చేశావు; నన్నుచంపు! పీకనులుము! నన్ను హత్యచేసి మీరిద్దరూ సుఖంగా ఉండండి! [ఆవేశంతో వాసు కాళ్ళమీద పడుతుంది]

వాసు: (తప్పించుకొని)వసంతా! నీఅజ్ఞానానికి తోడు సంభాషణకూడా నిందాస్పదంగా ఉంది.

వసంత: (రోషంతోలేచి] సరే! నన్నవమానించడానికే కంకణం కట్టుకున్నావు కాదూ! నాఅంతట నేను వలచిరావడంచేత కదా నీకు చులకనయాను. నాబ్రతుకు శాశ్వతంగా పాడుచేసిన ఫలితం అనుభవిస్తావు సుమా! ఆడది తెగించిందంటే అంతులేదు.

వాసు: అవును. స్త్రీకి ప్రేమ తప్పితే ప్రతీకారమే శరణ్యం.

వసంత: మరొక్కసారి ఆలోచించుకో! ఆఖరుమాట చెప్పు!

వాసు : [జేబులోనుండి కొయ్యదువ్వెన తీసి అందిస్తాడు. వసంత కొయ్యదువ్వెన విసరికొట్టి తారాజువ్వలాగ వెళిపోతుంది. వాసు చిరునవ్వుతో రాట్నం త్రిప్పుతూ)

పాట—వెలుగుము, వెలుగుము విరామ మెరుగక

ఆంధ్రజ్యోతీ! అమరజ్యోతీ!! వెలుగు||

1. మూఢగాఢవిశ్వాసము కాల్చి, పౌఢహృదయముల బలిగావించి,
చీకటిండ్లలో జ్వాలరగిల్చి, వెలుగుము వెలుగుము విశ్వమంతటా||

2. కిరణ మెరుంగని నరకహృదులలో,
చదువుకొన్న శిథిలాలయాలలో
పాతుకుపోయిన బండచీకటిని
వెదకివెదకి వేటాడుము నేడే!!! (హనుమదింద్రకంటి)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

పదునేడవరంగము.



(సమయము ఉదయం గం|| 9 లు.)

[లక్ష్మీపతిఇల్లు, లక్ష్మీపతి పడకకుర్చీలో కూర్చుంటాడు పంచ, చొక్కా చత్వారపుజోడు ధరించి దస్తావేజులుచూస్తూ]

[గోపాలం వసంత ప్రవేశం. వసంతచేతిలో స్టెతోస్కోపు]

గోపా : డాక్టరుగారు వచ్చారు.

లక్ష్మి : (లేవబోతూ) కృష్ణారావుగారి కుమార్తేనా?

వసంత : లేవకండి, కూర్చోండి! అలాకూర్చోండి ఫర్వాలేదు.

లక్ష్మి : మీరువస్తారని, పరగడుపున చూస్తే మంచిదని ఏమీ పుచ్చుకోకుండా ఉండిపోయాను. గోపాలం! మొదటి నుంచీ చెప్పునాయనా జబ్బుస్థితి.

గోపా : ఏముందీ! అంతా ఆర్నెల్లయింది. అజీర్ణం, ఏమయినా తింటే పడకపోవడం, నీరసం, నిస్సత్తువా...

వసంత ; మీకు తేణుపులు, కడుపుపొంగు, నొప్పి, ఆకలి లేకపోవడం ఉన్నాయా?

లక్ష్మి : ఆహా! ఉన్న రోగమే అది.

వసంత : నిద్దర పడుతుందా?

లక్ష్మి : కన్ను మూడుచుకున్నా నిద్రపట్టదు. ఎప్పుడు కన్ను మూసినా, తెరచినా, దస్తావేజులు, కోర్టులు, రైతులు, జప్తులు, అమల్లు కళ్ళముందు తాండవమాడుతూ ఉంటాయి.

వసంత : మీకు మనోవ్యాధి ఎక్కువ ! [స్టెతోస్కోపుతో వీపు గుండెలు తనిఖీచేస్తుంది.]

లక్ష్మి : (కడుపు చూపించి] ఆగొట్టం పెట్టి ఇక్కడ చూడరూ?

వసంత : అక్కడ చూడక్కరలేదు.

లక్ష్మి : అసలు అజీర్ణంకదా ! కడుపు చూడడం మానేసి పీపెందుకూ చూడడం? చెయ్యి చూడండి! [చెయ్యిస్తాడు]

వసంత : [నాడిచూసి] చేతిల్లో బాగానే ఉంది.

లక్ష్మి : చేతిలో బాగా ఉంటే జబ్బేమిటి? నాడి గమనం హంస లాగుందా? కప్ప లాగుందా ? పాము లాగుందా ?

వసంత : అదేమో ! ఆకప్పా పాము మాకు తెలియదు.

లక్ష్మి : ఆఁ ! మరేమిటి తెలుస్తుంది?

వసంత : ఫోటో తీయించి జబ్బు కని పెడతాం.

లక్ష్మి : అయితే మన ఊళ్ళో పోటొగ్రాపులు తీస్తాడు, ఆనాగేశం ఉన్నాడు కాబోలు పిలిపించూ గోపాలం !

వసంత : అదికాదు, పెద్దాసుపత్రిలో ఎక్సరే అని ఫోటో తీస్తారు.

లక్ష్మి : అలాగా? ఇంతకంటె బాగా తీస్తారేమిటి ?

వసంత : మీరు వ్యవహారతాపత్రియం తగ్గించుకుంటే గాని మనశ్శాంతి ఉండదు. ఇవాళ మీకు నాలుగుమోతా

దులు మందిస్తాను. ఆరేసిగంటలకొక మోతాదు పుచ్చుకోండి.

లక్ష్మి : నిద్దరపట్టేలాగ చేస్తారా ?

వసంత : దానికి వేరేమందు పంపిస్తాను. దానిని ఉపయోగించే విధానం మీ మేనేజరు గారితో చెపతాను. ఈపూటకి మీరు లఘువుగా భోజనంచేసి రెస్టుతీసుకోండి. నేను శలవు తీసుకుంటాను!

లక్ష్మి : మంచిదమ్మా ! (వసంత వెళుతూండగా, గోపాలం దిగబెడుతూ)

గోపా : కాస్త గుణమిచ్చేవరకూ రెండుపూటలా వచ్చి చూస్తారుకాదూ ! [వసంత-అంగీకారసూచన]

లక్ష్మి : గోపాలం ! ఈమెను కుదిర్చావేమీ ? ఈవిడ సంబంధం వదులుకోమనీ నరసింహశాస్త్రిగారి సంబంధం చేసుకోమనీమావాడితో చెపదాం అనుకుంటున్నాంగదా ! అలాటప్పుడు ఈవిడ మనకేమి అనుకూలంగా ఉంటుందీ ?

గోపా : ఆసంశయం అక్కరలేదు. ఇద్దరికీ రంగంచెడింది. అబ్బాయిగారిపోలంపాటుకూలిపనీచూసి ఈవిడకసహ్యంపుట్టి విడిచిపెట్టేసింది.

లక్ష్మి: అయిందీ శృంగభంగం! మంచి పనిచేసింది. మరేం చేస్తుంది! ఇంక ఆనరసింహశాస్త్రిగారి సంబంధానికి ఒప్పుకుంటాడన్నమాటే !

గోపా : వట్టిభ్రమ ! ఒకంతట ఒప్పుకుంటారండీ ఆయన ? చూస్తూఉండండి నేనన్నమాట ఊరికే పోతుందేమో !

లక్ష్మి : ఒప్పుకోడూ ? ఒప్పుకోక ఏం చేస్తాడు? తన ఇష్ట మేనేమిటంటాను?

గోపా : ఒప్పుకుంటే సంతోషమే! నాఅభిప్రాయం ఒప్పు కోరనీ !

లక్ష్మి : ఒప్పుకోకపోతే ఇంట్లోంచి పొమ్మంటాను. ఇది వరకు చెప్పానుకానూ! ఆస్తిలో వాడికి హక్కు లేకుండా చేసి ఆస్తంతా నీపేర రాసేస్తానని చెప్పేస్తాను. దానితో తెగు లణుగుతుంది.

గోపా : అబ్బాయిగారు దయచేస్తున్నారు.

వాసు : (ప్రవేశించి) నాన్నగారూ !

లక్ష్మి : వచ్చావా !

వాసు : నన్ను రమ్మని కబురంపారు కాదూ ?

లక్ష్మి : అవును (కాగితాలకట్ట విప్పి ఒక ఉత్తరం తీసి వాసు కిస్తాడు. వాసు చదువుకొని తిరిగి ఇచ్చేస్తాడు.)

లక్ష్మి : ఏమంటావు ?

వాసు : నరసింహశాస్త్రిగారి సంబంధం అక్కరలేదని వ్రాసేదాం.

లక్ష్మి : ఏమీ ?

వాసు: ఆపిల్లను నేనుచూడలేదు. నాకు అనుకూలిస్తుందో లేదో నే నెరగను.

లక్ష్మి : పదహారువేలు కట్నమిస్తామని వాళ్ళంత ఆప్యా యంగా వస్తూంటే......

వాసు : ఆకారణంచేత నాకసలే యిష్టంలేదు. కట్నమనే పేరు పొరపాటు. అది శుల్కం.

లక్ష్మి : కోరికట్నమిస్తాంటే ఎంతగౌరవం! అలాంటి అనవసరప్రసంగం చెయ్యకు. మర్యాదగా ఉండదు.

వాసు : అవి మీపూర్వుల అభిప్రాయాలు.

లక్ష్మి : ఇందుకే నేను నీకు కబురంపాను తెలుసునా? అక్కడ ఆమాలాళ్ళతో పార బొరిగె పట్టుకొని గొప్పు తవ్వుతున్నావట! డబ్బు తగలేస్తున్నావని ఒకబాధాను, ఈఅపకీర్తి తిప్ప కొంతానా? నాజీవనం ఇలా వెళ్ళకుండా నువ్వీ అప్రచ్ఛపు పనులు చేస్తాంటే నలుగురూ ఏమంటారు? లోకులకి వెరవక్కర లేదూ?

వాసు : నేను చేసే పనులలో మంచీ చెడ్డా లోకమే నిర్ణయిస్తుంది.

లక్ష్మి : ఎప్పుడో కాదు. ఇప్పుడే నిర్ణయించింది. నీకు పిచ్చి అనీ మతిభ్రమనీ అంటున్నారు.

వాసు : స్వార్థపరులకు నాపనులు పిచ్చిగానే కనబడతాయి.

లక్ష్మి : ఆకృష్ణారావుగారి అమ్మాయిని పెళ్లాడుతానన్నావట!

వాసు : అవును. గ్రామజీవనానికి అంగీకరించి నేను చేసే ప్రతీకార్యంలోను తోడ్పడితే ఆమెనే వివాహమాడుదామనుకొన్నాను. ఆమె అందలం మీద కూర్చోడం చేత ఆమెకూ నాకూ పొసగలేదు.

లక్ష్మి : ఏమి అందలం మీాద కూర్చుంది ?

వాసు : నాకు సహధర్మచారిణిగా ఉండే స్త్రీ గ్రామజీవనానికి అంగీకరించాలి. ముతకగుడ్డ కట్టుకొని రైతుల స్త్రీలతో కలిసి కలుపుగోరుగా మసలాలి. టూత్ పేస్టులూ బ్రష్‌లూ మాని తుమ్మపుల్లతో పళ్ళు తోముకోవాలి. తలకు వాసననూనెలు మాని కొబ్బరినూనె రాసుకోవాలి. సబ్బులుమాని షీకాయి కుంకుడుకాయి ఉపయోగించాలి. కాఫీలు, టీ, మాని చద్దన్నం తినాలి. కారెక్కడం మాని కాలినడకను గ్రామాలంట వెళ్లి ప్రబోధం చెయ్యాలి.

లక్ష్మి : ఆమాలాళ్ళతో నెత్తిమీాద పెంటతట్టలూ పేడతట్టలూ పెట్టుకొని మొయ్యక్కరలేదూ ? ఉడుపులకీ దంపులకీ వెళ్ళక్కరలేదూ? ఇదీ,మతిభ్రమ అనడానికింకా అనుమానమేమిటి ? ఈఅడ్డమయిన చాకిరీ చెయ్యడానికి ఏపెళ్ళాం వస్తుందిరా నాయనా ! చదవేస్తే ఉన్నమతీ పోయినట్లుంది. చక్కా నామాట విని వాళ్ళ సంబంధం చేసుకో ! గొప్ప శ్రోత్రియకుటుంబం! మంచి సాంప్రదాయం.

వాసు : వివాహవిషయం నాకు మీారు పూర్తిగా విడిచిపెట్టేయాలి.

లక్ష్మి : ఇంక నాప్రసక్తి ఏమీా అక్కరలేదూ? నామాట వినవన్నమాట !

వాసు : ఈవిషయంలో తప్ప ఇంకేవిషయమయినా చేతులు కట్టుకొని బద్ధుడనై వింటాను.

లక్ష్మి: పదివేలు పట్టుకువెళ్ళి అక్కడపోసేశావట!

వాసు: ఆగ్రామం చాలా వృద్ధిచేశానని వాళ్ళంతా సంతోషిస్తున్నారు. భాగ్యవరం ఇప్పుడు ఆదర్శమయిన గ్రామం అయింది. అనేక పరిశ్రమలు అమలులో ఉన్నాయి.

లక్ష్మి: బాగానే ఉందేమీ? వాళ్ళెంత పెడితే నద్దంటారు? ఆ రైతువాళ్ళతో పాటలు పాడుకుంటూ భుజం, భుజం కలిపి, వాడి నోట్లోచుట్ట నువ్వు! నీనోట్లోచుట్ట వాడూ కాలుస్తూ.........

వాసు: ఈఅభిప్రాయాలు మీమనసు కెక్కించి ఎవరో బాగా దుష్ప్రచారం చేసి ఉండాలి.

లక్ష్మి: ఒకరు చెప్పేదేమిటి? నాకు జ్ఞానం లేదూ? చిన్నప్పుడు తల్లి పోయినప్పటినుండీ సంరక్షణచేసి, చదువుచెప్పించి డబ్బు ఎలాగ తగలేసినా ఊరుకొని, పెంచి పెద్దవాడిని చేస్తే నేనేమి విషంపెట్టానా? శుభ్రమయిన సంబంధం కుదిర్చి పెళ్ళిచేసుకోమంటే తెగులా? నాపెద్దరికం ఏంవుంచావు? ఈసంబంధం చేసుకోకపోతే నీకు నాఆస్తిలో కానీఇవ్వను. ఇదంతా నాస్వార్జితం తెలుసునా?

వాసు: నావివాహవిషయంలో కష్టసుఖాలు బాధ్యతలూ నిర్ణయించుకోవలసిన ధర్మం నాదే! ఈవిషయంలో పట్టుదల వహించి మీరు ఆస్తి ఇవ్వనంటే ఆస్తికోసం అంతరాత్మను చంపుకోలేను.

లక్ష్మి: ఆస్తి ఇవ్వనన్నా నీకు లక్ష్యం లేదన్నమాట! ఇదిగో ఆఖరుమాట చెప్పేస్తున్నాను. ఆపల్లెటూరు విడిచి

పెట్టి ఈసంబంధం చేసుకొని ఇక్కడ ఉంటావో, నీయిష్టమే నీదని ఆస్తి వదులుకొని దేశదిమ్మరివై పోతావో,ఆలోచించుకొని ఒక్కమాట చెప్పు!

వాసు: నాఅభిప్రాయాన్నిబట్టి రూపాయిలు అణాలు పైసల్లో లెక్కపెట్టదగినదే ఆస్తి కాదు. దేశసేవకుడికి త్యాగము, సేవ, శరీరబలం, విజ్ఞానము, ధైర్యసాహసాలు, ఇవన్నీ ఆస్తికిందే లెక్క! ఇటువంటి ఆస్తి ఉంటే ధనరూపమయిన ఆస్తిలేకపోయినా నాకు చింత లేదు.

లక్ష్మి: అడుక్కుతిని పోతావు సుమా!

వాసు: దేశంకోసం అడుక్కుంటూన్న వాళ్ళలో, గాంధీ మాలవ్యాలవంటి మహాపురుషులున్నారు.

లక్ష్మి: మరి దయచేయి! వెళ్ళు! నేనుచచ్చినా నాగుమ్మం తొక్కొద్దు.నాఅనంతరం నీకుకానీముట్టకుండా ఆస్తంతా ఇదిగో ఈగోపాలానికి వ్రాసి యిచ్చేస్తాను. తెలిసిందా? ఇతనే నాకు కొడుకు. నువ్వు నాకు కొడుకువు కావు. వెళ్లు!

వాసు: ఆస్తి ఏదయినా సంస్థకిస్తే దేశానికి ఉపకారం!

లక్ష్మి: నీసలహా అక్కరలేదోయి! మహా దేశభక్తుడివి బయలుదేరావు.

వాసు: పోనీండి. మీరు చాలా నీరసంగా ఉన్నారు. మీకు ఆరోగ్యం కలిగేవరకూ ఇక్కడే ఉండి ఉపచారం చేస్తాను.

లక్ష్మి: నామొహం చూడకోయి! నేను తండ్రినీ కాను,

నువ్వు కొడుకువి కావు, వెళ్ళుమరి! నువ్వు ఉన్నకొద్దీ నాకు బాధే! ఏపాపం చేసికొని పుట్టేనోయి భగవంతుడా!

వాసు: ఈఅభిప్రాయాలు కాలగర్భంలో పరివర్తనం పొందాలి. నేను ఉన్నకొద్దీ మీకు మనోవ్యాధి ఎక్కువవు తుంది. అది మీఆరోగ్యానికి భంగకరం! క్రమంగా ఈశ్వరుడే మీహృదయంలో ప్రవేశించి సత్యనిరూపణ చేస్తాడు. శలవు.

(వాసు వెళతాడు)

గోపా: ఎంత సాహసం! చిలక్కిచెప్పినట్లు ఎంత ఓపికగా చెప్పారూ!

లక్ష్మి: వెళ్ళిపోయాడూ?

గోపా: ఆ! నేనిదివరకే చెప్పాను. ఇది ఇంతవరకు వస్తుందని.

లక్ష్మి: ప్రారబ్ధకర్మం! అనుభవించక తప్పతుందా?

గోపా: ఆయన యెదట ఆస్తి అంతా నాకిచ్చేస్తానన్నా లక్ష్యపెట్టారుకారు చూశారా! మీరు నిజంగా నాపేర దానపట్టా రాసిచ్చేస్తే ఏంచేస్తారో!

లక్ష్మి: అన్నాను గానీ...ఏలాగ చెప్పూ! అలాగయినా లొంగుతాడేమో అని చూశాను. పేగుకదా! ఎలాగ తీసి పారేయడం! రేపు ప్రాణం కాస్తా హరీమన్నాక పరానికిన్ని నీళ్ళు పొయ్యడానికి వాడు పనికిరావాలిగానీ.........

గోపా: అలాగే? కన్నకడుపయిన తరువాత ఆబంధనం వదిలిపోతుందా? జీడిమచ్చ! అయితే ప్రస్తుతం ఒక పని

చెయ్యండి. ఒక దస్తావేజుమీద బెదిరింపుకోసం, వృత్తి బెదిరింపుకోసమే! ఆస్తిలో హక్కు లేకుండా డిజిన్‌హెరిట్ (Disinherit) చేస్తున్నట్లు వ్రాయించిచూపించండి. ఈలాగా ఆయనకీ బుద్ధి మారవచ్చును. ఇది చూసేసరికి నిజమేలనుకొని చక్కా పరుగెత్తి వస్తారు. ఏమంటూరా! లక్షలకి విలువైన ఆస్తి రేపాయన చేతిలోకి వస్తే దేశమంతటా విరజల్లి ఆకీర్తి తానే పొందవచ్చునని ఆశపడతారు.

లక్ష్మి: అయితే! కానీ! పోతాను. నీరసంగా ఉంది.

గోపా: నేను సెలవు తీసుకొని వెళతాను. మందు కోసం పంపిస్తానూ!

[ఇద్దరూ చెరోదారి వెళతారు.]

తెర.

ఓం
బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పదునెనిమిదవరంగము.

---

(కర్మవీరుని సంచారప్రదేశం.)

కర్మ : పాట- ఆంధ్రరక్తమే నీలోనుంటే,
అన్యదాస్యమే పోవలెనంటే,
ఆంధ్రపతాకం బెగరాలంటే
ఆంధ్రరాష్ట్రస్థాపనకై పూనరా ||ఆంధ్రమాతృ||

గీ|| తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయవార
కెరలుపడి తెల్గునేల ముగించనిమ్ము!
నేటితో నస్వతంత్రతానియతమైన
ఈబ్రతుకు తెన్గువారు భరించలేరు.

(విశ్వనాథ)

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## పందొమ్మిదవ రంగము.



సమయము- ఉదయము 10 గంటలు.

భాగ్యనగరం, వాసు కుటీరము.

పాట : మతభేదముమాని ఆంధ్రమాతృసేవ సేయరండు
శ్రుతకీర్తులు ఆంధ్రవీరసుతులు సుతలు నడుముకట్టి,
పల్లెలందె కలదు తెలుగుతల్లికి ఆయువుపట్టు
పల్లెల నభివృద్ధిపరుప పట్నములను విడచిరండు ||

(జానకి రాట్నంమీద నూలుతీస్తూ పైపాట పాడుకుంటూ ఉండగా రామం వెనకపాటునవచ్చి జానకికళ్లు మూస్తాడు.)

జానకి : [చేతులు విప్పుకోడానికి ప్రయత్నిస్తూ] నాకళ్ళుమూసిన వారికి నేను నూలువడకడం ఇష్టంలేనట్లే!

రామం : (చేతులుతీసి ఎదురుగా వచ్చి) అయితే క్షమించాలి! ఇంతశ్రద్ధగా ప్రతీభారతీయస్త్రీ నూలువడికితే స్వరాజ్యం రాడానికిన్నాళ్ళు కావాలా?

వాసు : (ప్రవేశించి) జానకీదేవి మన ఆశ్రమానికి ప్రాణప్రతిష్ట. వనదేవతలాగ కలకలలాడుతూ ఆశ్రమమంతటికీశోభ తెచ్చింది.

రామం : ఏమీ అరమర లేకుండా కులాభిమానం వదలి

కలుపుగోరుగా మన జట్టులో కలిసిపోయింది.

వాసు: ఏ ఉద్యమమయినా స్త్రీలు పూనుకుంటేనే చకచకా సాగుతుంది.

[నాగిరెడ్డి ప్రవేశం. బ్లాజరుకోటు, మల్లుచొక్కా; పంచ కండువా మాత్రం ఖద్దరు.]

నాగి: దండాలండి!

వాసు: రండి! మిమ్మలిని నేనెక్కడయినా చూశానా?

నాగి: మాది కోనసీమండి!

వాసు: చాలాసంతోషం! మాభాగ్యవరం చూశారా? దీన్ని ఆదర్శమైనగ్రామం చేస్తున్నాం. రైతులకు సకలసౌకర్యాలు కలిగిస్తున్నాం. మీ రేదయినా పనిమీద వచ్చారా?

నాగి: తమతో సిన్నమనవి సేసుకుందామని...తమ మేనే జరుగారు...గోపాలంగారు...నావొక అయిదువందలు ఎగేశారండి. తమతోమనవి సేసుకుంటే ఇప్పించేస్తా...ర...ని...

వాసు: అప్పిచ్చారా?

నాగి: అప్పుకాదండి! ఒకయవ్వారంలో ఇరుక్కుపోయానండి!

వాసు: ఏదయినా దళారీ బేరమా?

నాగి: ఏంసెప్పనండి! సముకానికొచ్చి రాయబారమెందుకండి! ఆయన కోసానుంది కాదండి నీలాశలం!

వాసు: సానికూడా ఉందా? నాకు తెలియదు.

నాగి: ఆసానికోపిల్లుంటే కన్నెరికానికి కుదిర్చినారండి.

బుద్దిగడ్డితిని అయిదువందలు ఆరిసేతుల్లో పోశానండి! ఆపిల్లనేమో తమరు తప్పించి ఎక్కడికో పంపేశారని యిన్నాను.

వాసు: ఆసాని మామేనేజరు తాలూకేనా? ఆపిల్ల ఒక బ్రాహ్మణపిల్ల; ఆమెనపహరించి బలవంతంగా వ్యభిచారంలోకి దింపడానికి ప్రయత్నించడంచేత నేను రక్షించవలసి వచ్చింది.

నాగి: బొమ్మలపిల్లే? అయ్యబాబూ! ఎంతపని సేశాడు.

వాసు: ఆఅమ్మాయి ఇక్కడే ఉంది. అదుగో!

నాగి; ఏటీ! ఈయమ్మే! (లెంపలువాయించుకొని) తల్లీ! దండం! ఎంతపనికి తలపెట్టాను. ఆయమ్మ తప్పించుకు పారిపోబట్టిగాని ఆయాళ ఎంతపొరపాటు జరిగిపోను. తమరు దేముడులాగ ఆయమ్మను కాపాడారు. [జానకి వెళుతుంది.)

వాసు: మీావిషయంలో నాకేమీా సానుభూతి లేదు. ఆధనం మీారు దుష్కార్యానికి వినియోగించబోయారు. అది మీాకు జరిమానా అనుకోండి.

వెంక: [ప్రవేశించి, నాగిరెడ్డినిచూచి] ఇతగాడెందుకు వచ్చాడిక్కడికి?

నాగి: ఏంమాఁవా!

వాసు: ఈయన్ని నువ్వెరుగుదువా?

వెంక: నాకు మేనల్లుడవతాడండి!

వాసు: అలాగా? ఏం! ఇలా విడిచిపెట్టాశా వితన్ని?

వెంక: ఏంసెయ్యమంటారండి? తల్లిమాట, తండ్రిమాట

లచ్చెం లేదండి. ఆళ్లూరికి పెద్దరైతుకొడుకండి. వెయ్యిఎక రాల బూమి. బంగారులా మూడుపంటలుపండేదండి. అంతా తగలేసినాడండి.

(పోలీసు సబుఇన్స్పెక్టరు ప్రవేశం.)

పోలీ : నాగిరెడ్డి ఇక్కడున్నాడండీ ?

వెంక : ఏంబాబూ !

పోలీ : అతనికి ఎరస్టువారంటుంది. నిన్నరాత్రి వాళ్ళ గ్రామంలో జరిగిన కూనీలో అతని కుమ్మక్కు బాగా ఉందని అనుమానం బలంగాఉంది.

వెంక : ఇడుగోటండి. తీసుకుపోండిబాబూ! ఏసెయ్యండి, నాలుగేళ్ళో అయిదేళ్ళో! ఇక్కడేమీ తినడానికి లేదులెండి. అంబలీతోపా యెట్టండిఇంత. బాగా బుద్దొస్తాది. యెదవ తెగు లనీ! యేసాలు, సోకులూ; సరదా తీరిందా ?

నాగి: [వెంకటరెడ్డికి దండంపెట్టి) నేనేమీ ఎరగను మాంవా! నీపాదాలసాచ్చిగా చెపుతున్నా! ఈమద్దిని నేను మావూ ళ్ళోకే ఎల్లలేదు. ఆకరణం కావాలనేకొద్దీ నామీద కేసెట్టిం చాడు.

వెంక : ఎల్లవోయి సన్నాసిమొకమా! మీబాబు పాలే ళ్ళతోపాటు గోచీపెట్టుకొని పొలంలో పాటుపడి గడించాడు కదా! మీయమ్మ పిడకలకాడనుంచీ అమ్మి సంపాయించింది కదా! నువ్వెన్నడయినా పొలంకాసి సూసినావా! నీపొల మెక్కడుందో, దానిపొలిమేర ఎక్కడుందో నీకెరికేనా ?

[వాసుతో] బాబుగారు! రోజుకి నాలుగుసుట్లు కాఫీవో శేలండి! మాపులు పొద్దుగూ కేతలికి బోగమిాదిల్లో తానకమండి. నాట కాల కంటాా్రిక్టులండి; టోలు గేటు కంటాా్రిక్టులండి; బస్సులు కొన్నాళ్ళండి. ఆమద్దిల కలకత్తావెళ్లి అయేటండి ఆబొమ్మలు తెరమిాద ఆడుతాయి—

వాసు: సినిమా

వెంక: అయి తీయించినాడండి. ఆపాళంగా యేటుందండి, పొలమంతా సున్న సుట్టేసినాడండి. మాఁవంతా మద్దెపడి ఇతని బార్యాపేర నూరెకరాలు మిగిలితే రాయించేశామండి.

రామం: ఆరోజున కృష్ణారావుగారు మిాతో-టీనా మాట్లాడుతున్నారు. జిల్లాబోర్డుకు నిలబడ్డారా?

నాగి: లేదండి! ఆరిపైయదికార్లు నేను కాంగ్రెసులో పనికిరానని తోసేశారండి. లేకపోతే అయో రెండువేలు దండుగై పోనండి.

పోలీ: ఏమయ్యా! వేగం రావాలి!

నాగి: మాఁవా! నన్ను రచ్చించవూ! బుద్ది గడ్డితిని ఇన్నాళ్ళు డబ్బుతగ లేసుకున్నా పెద్దోళ్ళలో తలెత్తుకు తిరిగాను. నువ్వు రచ్చించకపోతే పీకకి ఉరెట్టుకు సచ్చిపోవాల.

వెంక: నన్నేటిసెయ్యమంటావోయి!సియేసాలు, సోకులు, తాలూకాబోర్డులు, బొమ్మలాటలు, ఇన్నాళ్ళు మేము సచ్చామనుకొన్నావేటి? మామాటెప్పుడేనా యిన్నావూ?

వాసు: ఇప్పుడయినా హృదయపూర్వకమైన పశ్చాత్తా

పం కలిగితే కొంతమేలే !

వెంక : ఆరికాళ్ళట్టుకో! ఆరు దేముడు. నీపాపాలుపోతాయి.

నాగి : [వాసుకి నమస్కరించి] బాబుగారూ! తమరు రచ్చించరూ ?

వాసు : అయ్యా ! రాజ్యాధికారంవహించి స్వర్ణాభిషేకాలతో కవులను పోషించిన రెడ్డికులంలో పుట్టావు. నీ కుల మర్యాద నిలబెట్టుకోవద్దయ్యా ? రైతుబిడ్డవుకదా ! నీవృత్తి ధర్మం చూసుకో వద్దయ్యా ? రైతుబిడ్డ చదువుకోవాలి. తన పొలం చూసుకోవాలి. చేతనయినంత దేశసేవ చెయ్యాలి. మీరుకూడా జమీందార్లలాగ పొలం ఎక్కడుందో చూడకుండా దుర్వ్యయంచేస్తే అధోగతికి అభ్యంతరం ఉందా ? మనదేశానికి వెన్నెముకగదా రైతు ! వెన్నెముక కుళ్ళితే శరీరం నిలుస్తుందా !

నాగి : బుద్దొచ్చిందండి. దైవసాచ్చిగా చెపుతున్నాను. ఈ కేసుల్లో నేనేమీ ఎరగనండి !

వాసు : వెంకటరెడ్డీ ! పాపం, కన్నీటితో పాదాలు తడుపుతున్నాడయ్యా ! పతితుడికి పశ్చాత్తాపమే శిక్ష ! (నాగిరెడ్డితో) ఏమయ్యా ! మీరు ఊరూరా వెళ్ళి ఇంకా ఈవిధంగా పాడవుతున్న రైతుసోదరులకి ప్రబోధంచేస్తారూ ? వృత్తిధర్మం నిలబెట్టుకోమని మీచరిత్రవల్ల గుణపాఠం నేర్చుకోమనీ ప్రచారం చేస్తారు?

నాగి : చిత్తం ! తమరేమి సెయ్యమన్నా సేస్తానండి.

వాసు : ఇక్కడ రైతుమహాసభ జరిపిస్తాం. దానిలో మిమ్మల్ని నిలబెట్టి మీచరిత్ర చెపతాం! అంగీకరిస్తారా?

నాగి : బుద్ధిమారిపోయాక సిగ్గుపడటం ఎందుకండి?

వాసు ! (పోలీసుతో) తమరు ఇతన్ని తీసుకొని వెళ్ళండి. (నాగిరెడ్డితో) వెళ్ళండి మీరు ! నేను తహసీలుదారుగారితో మాట్లాడి జామీను ఏర్పాటుచేయిస్తాను.

నాగి : ఈపూటకి కొట్లో కూకోవాలాండి?

వాసు : ఆహా! ఈరోజుకు తప్పదు.

(నాగిరెడ్డి పోలీసుసబిన్స్పెక్టరుతో వెళతాడు)

వాసు : రెడ్డీ! మనకింకేమిటి గత్యంతరం? నాన్నగారు ఇటుపైని కానీకూడా ఇవ్వనన్నారు. పెద్ద యజ్ఞమంతప్రయత్నం చేస్తున్నాం మనం! ఈఉద్యమానికి విఘాతం రావలసిందే?

రామం: ఈవిషయంలో మేనేజరుగారి అగ్నిలోకృష్ణారావుగారు డాక్టరు వసంతాబాయిగారు ఆజ్యధార పోసిఉంటారు.

వెంక : తమవంతు ఆస్తి పంచిపెట్టమని నాన్నగారితో చెప్పండి బాబూ!

వాసు : అది సాధ్యంకాదు. ఆస్తి అంతా వారి స్వార్జితం! ఆప్రయత్నం చాలా అవినీతికరం!

వెంక : మరయితే బాబుగారికి మాంకట్టే సిస్తులు తమకే ఇచ్చేస్తాం.

వాసు : అది కేవలం దొంగతనం; నాకధికారంలేని సిస్తులు

నేనెలాగ వసూలు చెయ్యాను ?

వెంక: సరిరా! తమ రేటి సెప్పినా ఒప్పుకో రేటి ?

రామం: మనదగ్గర ప్రస్తుతం నిలవవున్న చేతిపనులు, దంపుడుబియ్యం, ఖద్దరు, బళ్ళమీద గ్రామాలంటా పట్నాలంటా తీసుకువెళ్ళి విక్రయిద్దాం! ఆడబ్బు పెట్టుబడికి పనికి వస్తుంది.

వాసు: అదే మంచిఆలోచన, దానివల్ల మనఉద్యమానికి ప్రచారం కూడా జరుగుతుంది. ఈలోగా మనకి పెట్టుబడిపెట్టి తయారయిన వస్తువులు అమ్మిపెట్టే పరపతిసంఘం స్థాపించడానికి ప్రయత్నం చేదాం!

వెంక: ఆకాడికీలొటొస్తే మాం లేమట బాబూ! మాయిళ్ళేటి, వోళ్ళేటి, ఆస్తులేటి, మాపాణాలే మీపాదాలకాడ పడేస్తాంగాని తమరు దేముడిలాగ సేయించే పనికడ్డుగాని స్తామా? (వీరన్న రోజుకుంటూ పరుగెత్తివచ్చి)

వీర: బాబయ్యా! బాబయ్యా! కొంప మునిగిపోయింది.

వాసు: ఏమిటది?

వీర: అయ్యగారికి పానం సాలొచ్చింది.

వాసు: ఏఅయ్యగారికి?

వీర: ఇంకే అయ్యగోరికి! తమ నాన్నగారికి!

వాసు: ఏమీ?

వీర: అదేటో నోటంట మాటనేదు, పిలిస్తే పలకనేదు.

రామం: నీకెలా తెలిసింది వీరన్న?

వీర : ఇంజనీరుగారు డాకుదొరగారితో కలిసి తెల్లారిజామున మనవూరెల్లినామండి. బుగతగారినోపాలిసూదామని ఎల్లినామండి. అక్కడెవరో అమ్మగారు, మేనేజరుగారుఉన్నారండి. అంతా ఏకకంగారు పడుతున్నారండి. తమకి కబురు సెప్పాలని నేనిలా అడ్డుదారిని పారొచ్చినానండి.

వాసు : ఇదేదో విపరీతంగా ఉంది. నిన్న ఉదయం చూసిన నాన్నగారికి ఇంతత్వరలో ప్రమాదించవలసిన అగత్యమేముందీ?......ఎంత అమాయకులయ్యా నాన్నగారు... ఎంతశ్రమ......ఎంత తాపత్రయం!

రామం : మనం వెంటనే బయలుదేరి వెళదాం రండి!

వాసు : నాన్నగారి అమాయకత్వం తలుచుకొన్నకొద్దీ జాలికలిగి దానిలో కరిగిపోతున్నానయ్యా నేను!

రామం : ఈపాటికేదో చికిత్స జరుగుతూనే ఉంటుంది. మనం వెళ్ళేసరికి తేరుకోవచ్చును.

వాసు : ఏమో ఈశ్వరేచ్ఛ! నాఅంత్యోపచారానికేనా అవకాశం ఉంటుందో ఉండదో!

(వెళతారు)

తెర.

ఓం

బ్రహ్మకృపాహికేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఇరువదవ పరంగము.

(సమయము మధ్యాహ్నం గం॥ 1 కు)

[లక్ష్మీపతిఇల్లు. లక్ష్మీపతి పడుకొన్నగదికి ప్రక్కగదిలో గోపాలం ఆందోళనగా ఇటుఅటు తిరుగుతూ వసంతను సైగచేసి పిలుస్తాడు.]

వసం : [వచ్చి] ఏమండీ! ఎందుకు పిలిచారు ?

గోపా : కాస్త తెలివివస్తూన్నట్లుందే !

వసంత : వచ్చిందెలాగో బ్రహ్మాండంమీద. విరుగుడికి నాలుగు ఇంజక్షనులిస్తేను. నిద్దరకిచ్చినమాత్రలు రోజుకొకటి కంటె ఎక్కువ వేయకూడదని నేనింతా చెబితే అన్నిమాత్రలు ఒకేసారి ఎందుకిచ్చేశారు ?

గోపా : మత్తుబాగాచేస్తే మంచిదని.

వసంత : ఎంతమత్తు చెయ్యాలో నాకు తెలియదు? మీకీ స్వంతవైద్యం ఎందుకుచెయ్యాలి ? దానితో అతని ప్రాణం పోతే నాకు మాటరాదూ ?

గోపా : అలాగ పోయినా బాగుండును. మళ్ళా తెలివి వచ్చిందంటే నాగుండెల్లో రాయిపడింది.

వసంత : అయితే ఈపని మీరు కోరిచేసినట్లుందే !

గోపా : ఎందుకుచేశానో తెలుసునా ! ఇదిగో ఇందుకు!
[జేబులోనుంచి తీసి దస్తావేజు చూపిస్తాడు.)

వసంత : ఏమిటది ?

గోపా : నాపేర తనఆస్తి అంతా దానపట్టాగా యిచ్చేసినట్లు వ్రాయించి సంతకం చేయించేశాను. బాగా మత్తుగా ఉంటే చదువుకోకుండా సంతకం పెట్టేస్తాడని.........

వసంత : బాగానే ఉందే ! ఇదంతా నామీదకి తేడానికి చేసినట్లుంది.

గోపా : న్యాయమా ! నీప్రాణానికి నాప్రాణం అడ్డు వెయ్యనూ ! ఇదంతా ఎవరికోసం ! ఈలక్షలకి విలువైన ఆస్తి ఇప్పుడు మనది. మనం వెంటనే బయలుదేరి కలకత్తా వెళ్లి పెళ్ళిచేసుకుందాం ! రా ! కారు రెడీగా ఉంది.

వసంత : ఇప్పుడన్నారు గాని ఈప్రస్తావన ఇంకెప్పుడూ చేయకండి. మనిషి తాహతు తెలియకుండా మాట్లాడుతున్నారు.

గోపా : ఏమిటీమోసం! మీనాన్నగారేమీ చెప్పలేదూ?

వసంత : మానాన్నగారు చెప్పడమేమిటి ?

గోపా : ఈదానపట్టా వ్రాయించి మీకుచూపిస్తే మీకూ నాకూ వివాహంచేసి......

వసంత : ఏదీ ఆకాగితం ?

గోపా : [దస్తావేజు ఇవ్వగా వసంత దానిని తనజాకెట్టులో దాచేస్తుంది.)

వసం: ఇక వెళ్ళండి! మీరేదో తగుమనిషి అనుకొన్నాను.

గోపా: ఆదస్తావేజు తీసుకుంటావేమిటి? ఇలా ఇచ్చేయ్.

వసంత: ఇవ్వను.

గోపా: ఇవ్వకపోతే బలవంతాన్ని లాక్కొంటాను.

వసంత: షటప్——(Shut-up)

గోపా: ఏమిటీ జులుమ్! వద్దుసుమా! నేనుమహా కాని వాణ్ని. నువ్వు రవికెల్లో దాచుకొంటే ఊరుకుంటా నను కున్నావా?

వసంత: నిన్ను పోలీసుకి హేండోవర్ చేస్తాను.

[అని లోపలికి వెళిపోబోతుంది. గోపాలం ఆమెను అడ్డగించి దస్తావేజు లాక్కోడానికి పెనుగులాడుతాడు. వసంత తప్పించుకోడానికి ప్రయత్నిస్తుంది. వాసు, రామం, వెంకటరెడ్డి, వీరన్న చటాలున ప్రవేశిస్తారు, వాసు ఆశ్చర్యంతోచూసి గోపాలం వెనకనుండి ఛంగున వెళ్ళి అతన్ని కదలకుండా పట్టుకుంటాడు. గోపాలం తప్పించుకోడానికి ప్రయత్నించి మొలలోనుండి బాకు తీసి పొడవబోతాడు. రామం ఆచేయి పట్టుకుంటాడు. వెంకటరెడ్డి వీరన్న చెరొకజెబ్బా పట్టుకోగా గోపాలం వణుకుతూ తల వంచుకొని నిలబడిపోతాడు. అతనిచేతిలోనుండి బాకుజారి పడిపోతుంది. సిగ్గుతో భయంతో దూరంగాపోయి పైటసర్దుకుంటూ వణుకుతూనిలబడిన వసంతను వాసు సమీపించి)

వాసు: అసలు సంగతేమిటి చెప్పు వసంతా!

వసంత: మీనాన్నగారికి నేను వైద్యం చేస్తున్నాను. నిద్ర పట్టడానికి రోజుకొక మాత్రచొప్పున వెయ్యమని పదిమాత్రలసీసా ఇచ్చాను. ఈమేనేజరు పదిమాత్రలు ఒక్కసారే

యిచ్చేసి బాగా మత్తులో ఉండగా ఆయన ఆస్తి అంతా తనపేర దానపట్టాగా వ్రాయించుకొని సంతకం పెట్టించాడు. నన్ను తనతోరమ్మని బలవంతం చేస్తున్నాడు. ఇదిగో దస్తావేజు. (తీసిఇస్తుంది.)

వాసు : నాన్నగారెలాగున్నారు ?

వసంత ; ఇప్పుడే కొంచెంమత్తువిరిగి తెలివివస్తోంది.

వాసు : [గోపాలంతో] నిన్ను పామును పెంచినట్లు పెంచారు నాన్నగారు. విషమంతా పోగుచేసి ఒక పెద్దకాటు వేశావు. నీచరిత్రంతా నాకు తెలిసింది. సానితో ఏకీభవించి ఒక బ్రాహ్మణపిల్లని వ్యభిచారంలోకి దింపబోయావు కాదూ ? ఒక రెడ్డివద్ద అయిదువంద లపహరించలేదూ ? నాన్నగారిని మోసగించడానికీ ప్రాణం తియ్యడానికీ తలపెట్టావన్నమాట ! స్వామిద్రోహీ ! (వెంకటరెడ్డి వీరన్నలతో) మీరిద్దరూ ఇతన్ని పోలీసుస్టేషనుకి తీసుకువెళ్ళండి. నేనిప్పుడే వచ్చి ఫిర్యాదు ఇస్తాను. [వీరన్న వెంకటరెడ్డి గోపాలాన్ని తీసుకొని వెళతారు]

వాసు ; రామం ! రా ! నాన్నగారిని ముందుచూడాలి.

రామం : ఇకమీద వారినిక్క-ష్టుంచకుండా మనభాగ్యవరం తీసుకొనివెళ్ళడమే శ్రేయస్కరం !

[వాసు రామం వెళతారు. వసంత కూడా వారివెనక వెళుతుంది.)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఇరువదిఒకటవరంగము.



[సమయం మధ్యాహ్నం గం|| 2 లు.]

[కృష్ణారావు ఇల్లు. కృష్ణారావు తలవంచుకొని దిగులుగా చాపమీద కూర్చుంటాడు. వసంత చేతిలో ఆంధ్రపత్రిక సచిత్రవారసంచికతో ప్రవేశం)

కృష్ణా: [వసంతనుచూసి) అయిపోయిందమ్మా! మనపని ఇవాళ అయిపోయింది.

వసంత: ఏమీ! చాపమీద కూర్చున్నారేమీ? ఇక్కడ కుర్చీలు టేబిలు ఏవీ?

కృష్ణా: అన్నీ పోయాయి. కోఆపరేటివుబ్యాంకువాళ్లు పూతికపుల్లనుండీ బయటపడేసి జప్తుచేశారు.

వసంత: నామందులబీరువాలూనా? మందులసీసాలూనా? ఆపరేషను సామాన్లూనా?

కృష్ణా: అన్నీ జప్తుచేసి తీసుకుపోయారు.

వసంత: ఇంక నేనెలా బతకనిక్కడ? యింక వీధిలోకి వెళ్ళగలనా? తలెత్తుకొని తిరగగలనా? నాకేమిటి దారి?

కృష్ణా: నాకడుపున పుట్టినందుకు నీకు నేను చేసిన ఉపకారమిది!

వసంత: మీరు ఆమేనేజరుతో వాసుఆస్తి అంతా దానపట్టాగా వ్రాయించుకోమని చెప్పారా?

కృష్ణా: (ఉత్సాహముతో) అవును. వ్రాయించుకొన్నాడా?

వసంత: ఆ! వ్రాయించుకొన్నాడు!

కృష్ణా: అయితే వాసుని ఏడిపించామన్నమాటే!

వసంత: ఆమేనేజరుతో యింకా ఏమయినా చెప్పారా?

కృష్ణా: ఏమమ్మా! అలా అడుగుతున్నావు?

వసంత: నన్ను మేనేజరుకిచ్చి పెళ్ళిచేస్తానని కూడా చెప్పారా:

కృష్ణా: అవును. వాసుసంబంధం తప్పిపోయాక దానితో సమానమయిన సంబంధం యింతకంటె మరొకటి దొరుకుతుందా మనకి?

వసంత: అయితే, నాఆలోచనా అభిప్రాయం ఏమీ అక్కరలేదన్నమాట!మీాయిష్టంవచ్చినట్లూ పెళ్ళిసంబంధాలు కుదిర్చి నన్ను అమ్మచూపుతున్నారన్నమాట! మీాఉద్దేశాలు ఆశయాలు నెరవేరడానికి నన్ను అడ్డంపెట్టుకొని, నన్ను, నాజీవితాన్ని, నావ్యక్తిత్వాన్నీ బలిస్తున్నారా?

కృష్ణా: ఎందుకమ్మా అంతతీవ్రంగా మాట్లాడుతావు? యింకా నీతో ఈవిషయం సావకాశంగా చెపదామనుకొంటున్నాను. నేను చేసినప్రయత్నం నీమేలుకోసమే చేశానా?

వసంత: ఏంజేశారు? నన్ను ఆటబొమ్మని చేశారు. చిన్నప్పటినుంచీ పెంచి,చదువుచెప్పించి పెద్దదాన్ని చేసినందుకు మీాలో ఎన్నిలోపాలున్నా,మీారు తండ్రి అనే భక్తిభావంతో చూశాను. మీాప్రతిష్ఠ కాపాడడానికీ మీాఆశయాలు నెరవేర్చడానికీ

నాపేరుకూడా చంపుకొని వాసుతో వైరం తెచ్చుకొన్నాను అటువంటి నన్నే మీరు వంచించారు. ఈరోజున మీకొ మార్తె ననిపించుకోడానికి కూడా నేను సిగ్గుపడవలసి వచ్చింది.

కృష్ణా: దౌర్భాగ్యపు జన్మ ఎత్తాను.

వసంత: ఆమేనేజరు నన్ను బలాత్కారం చెయ్యబో యాడు. వాసు దేవుడిలాగ వచ్చి నామానం రక్షించాడు. మేనేజరు కైదులోకి వెళ్ళాడు. వాసుకీర్తి దేశమంతటా మారుమోగుతూంది. యిదిగోవినండి.

[ఆంధ్రపత్రిక సచిత్రవారసంచిక తీసి చదువుతుంది]

ఆంధ్రాభ్యుదయం—శ్రీ వాసుదేవరావు.

భాగ్యవరం అనే గ్రామాన్ని లెక్కలేని గ్రామపరిశ్రమల నెలకొల్పి స్వయంపోషకంగా చేసిన ఆంధ్రమూర్తి. లక్షాధి కారియయ్యీ కృత్రిమమయిన భోగవిలాసముల కాలదన్ని సహజసుందరమయిన గ్రామజీవనము చేపట్టిన ఆదర్శవ్యక్తి. ఆంధ్రులకు దాస్యతిమిరము బాపి ప్రకాశమానమగు స్వతంత్రతా మార్గము చూపిన ఆంధ్రజ్యోతి. చచ్చిన ఆంధ్రజాతీయతకు ప్రాణముపోసిన సంజీవి. ఆంధ్రత్వము మూర్తీభవించిన ఈమహాత్ముడు చూపిన మార్గముననుసరించి ఆంధ్రులు ధన్యులయ్యెదరుగాక!

కృష్ణా: క్షమించు! నన్ను క్షమించు!

వసంత: క్షమించవలసినది నేను కాను; వెళ్ళి ఆవాసు

కాళ్ళమీదపడి క్షమాపణకోరుకొండి. అతను మహాత్ముడు. ఎంత ఔదార్యం! ఎంత నిరాడంబరం! ఎంత సేవాపరత్వం! నిజంగా అతని పాదరేణువుగా అంటుకొని ఉండడానికైనా మనకి అర్హత లేదు.

కృష్ణ: కన్న కూతురుకి కూడా పగవాడినయిపోయాను.

వసంత: నాజీవితం భగ్నంచేసినది వాసుకాదు, మీరు. వాసు నన్ను భాగ్యవరం రమ్మని చేతులుపట్టుకొని ప్రార్థించాడు. నన్ను తామసం గర్వం ఆవహించాయి. మీవల్లే ఆవహించాయి. మీ ఆడంబరజీవనం మీకపటజీవనం నాకు అలవడినాయి. ఈరోజున వాసు ఆదర్శపురుషుడని వార్తాపత్రికలన్నీ కీర్తిస్తూంటే అతని పాదసేవచేస్తూ ఉండే అదృష్టంకూడా నాకు లేకుండా చేశారు. నాకు పశ్చాత్తాపం వచ్చింది. నేను వెళ్ళిపోతున్నాను. నాజీవితం గ్రామసేవ కర్పిస్తున్నాను. పాదచారినై గ్రామాలంటతిరిగి అందరికీ ఉచితంగా వైద్యం చేసుకుంటూ భాగ్యవరం వెళ్ళి వాసు కాళ్ళమీదపడతాను. కన్నీటితో అతనిపాదాభిషేకంచేస్తాను. క్షమించమని ప్రార్థిస్తాను. క్షమించకపోతే అతనిపాదాల మీద ప్రాణాలు విడుస్తాను. [తొందరగా వెళుతుంది.]

కృష్ణ: ఆఁ! ఆఁ! ఆఁ! (అని నిర్ఘాంతపోయి వెంటపడతాడు)

తెర.

ఓం

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఆంధ్రజ్యోతి.

## ఇరువది రెండవ రంగము.

(సమయము సాయత్రం 5 గంటలు.)

(భాగ్యవరంలో వాసుకుటీరం. జానకి ఆంధ్రమాత పటం ఉంచిన వేదికను పువ్వులతో ఆకులతో అలంకరిస్తూ ఉంటుంది. లక్ష్మీపతి పడక కుర్చీలో కూర్చుని ఉంటాడు. చాలా నీరసంగా ఉంటాడు. వాసు, రైతులు, అప్పన్నా అందరూ ఉంటారు.)

వాసు : నాన్నగారికి ఆరోగ్యం కలిగినందుకు నేడు మన మందరము ఆంధ్రమాతను ఆరాధించాలి.

రామం: అదిగో జానకీదేవి అప్పుడే వేదిక అలంకరిస్తూంది.

లక్ష్మి : ఈపిల్ల—ఎవరనీ... చెప్పావు.

వాసు : ఈమె ఒక బ్రాహ్మణపిల్ల; మనమే నేజరుకి ఒక సాని ఉందట. వాళ్లిద్దరు కలిసి తిరుపతి యాత్రకి వెళ్ళారట. ఈపిల్ల అక్కడ తల్లిదండ్రులనుంచి తప్పడిపోతే తీసుకొచ్చి వ్యభిచారంలో దింపబోయారు.

లక్ష్మి : ఎవరు ? గోపాలమే ! నక్కజిత్తులముండాకొడుకు ఇన్ని వేషాలు వేశాడూ ?

వాసు : ఈమె ఆసానియింట్లోంచి తప్పించుకొని రోడ్డు మీద పరుగెడుతూ నాకంటబడితే నేను తప్పించి ఈవూరు తీసుకొనివచ్చాను.

లక్ష్మి : వాళ్ళింటికి పంపేయలేక పోయావా ?

వాసు : పంపించి చూశాను. రామం తీసుకొని వెళ్ళాడు. ఆతలిదండ్రులు పిల్ల కులంచెడిందని అనుమానించి నిరాకరించారు.

లక్ష్మి : కులంకోసం కూతురిని వదలుకొన్నారూ?......

వాసు : ఈరోజుల్లోకూడా బ్రాహ్మణసంఘం ఇంత దుస్థితిలో ఉందంటే ఆశ్చర్య పడవలసిందే !

లక్ష్మి : ఆగోపాలాన్ని జైదుల్లో పెట్టించడం మహామంచి పనిచేశావు. నిన్ను పొడిచేడానికి కత్తికూడా తీశాడేం? నమ్మిన స్వామిద్రోహం! చూడూ!...వాళ్ళమాటలువిని ఏదో అన్నానని మనస్సులో ఉంచుకోకు.ఇదంతా చాలా కష్టపడి గడించాను. డబ్బుపాడుచెయ్యకు! డబ్బు లేకపోతే ఎవ్వడూ పలకడు. ఏగౌరవం ఉన్నా డబ్బుతోనే !

వాసు : దుర్వినియోగం ఎంతమాత్రమూ జరగదు.

వెంక : ఎవరో అమ్మగారు వస్తున్నారండి ఈయమ్మే కాబోలండి ఒక తోపుడుబండిలో మందులెట్టుకొని ఈచుట్టుపట్ల ఊళ్ళలో రెండుమూడురోజులనుంచీ మందులిస్తూ తిరుగుతున్నారట. కాంగ్రెసు మనిసిలాగే ఉంది.

వాసు : అటువంటి దేశసేవాపరురాలు మనకు లభ్యమైతే బాగుండును.

[వసంత ఖద్దరుచీరతో ప్రవేశించి వాసుపాదాలమీద పడుతుంది.)

వాసు : ఎవరిది ? వసంతా ? ఏమిటీ పరివర్తనం !

వసంత : నన్ను క్షమించు.

వాసు : నిన్ను నేను క్షమించడమేమిటి ?

వసంత : నీమనస్సు కనుక్కో లేకపోయాను. నిన్ను పిచ్చి వాడికింద కట్టి తూలనాడాను. నివురుగప్పిన నిప్పులాగ నీలో వెలుగుతూన్న మహత్తు కనిపెట్టలేక పోయాను.

వాసు : నువ్వు నాకు ఏమీ అపచారం చెయ్యలేదు. నామీద ఆశ పెట్టుకొన్న నిన్ను నిరాకరించి నీకు ఆశాభంగం కలిగించిన అపచారం నేనే చేశాను.

వసంత : ఆతప్పంతా నాదే! నీయెదుట నిలబడడానికీ నీపాదాలు ముట్టుకోడానికీ నాకు అర్హత లేదు. నీమీద పగ సాధిద్దామనే పాపపు తలంపుకూడా నాకు కలిగింది. ఏకోపమూ లేకుండా నాకు మానరక్షణ చేశావు. నీఔదార్యంలో నాపాపాలు కడుక్కున్నాను. నాకు పశ్చాత్తాపం వచ్చింది.

వాసు: వాస్తవికమయిన పశ్చాత్తాపానికి ఫలితం సంపూర్ణమయిన హృదయపరివర్తనం.

వసంత : నాకు నిజంగా పశ్చాత్తాపం కలిగింది వాసూ! జ్ఞానోదయమయింది. గ్రామసేవకు నాజీవితం అర్పించాను. ఆచరణలో పెట్టాను. నీసేవ చేయడానికి నాకు అనుజ్ఞ ఇప్పించు! నీదాసిగా నన్ను స్వీకరించు!

వాసు : రామం! ఈశ్వరవిలాసం చూశావా?

వసంత : (రామంతో) మీరుకూడా నన్ను క్షమించరూ? పల్లెత్తు అవమానమంటే సహించలేని నేను మిమ్మల్ని ఎంతో అవమానించాను. వాసు ఉత్తమగుణాలు అలవరుచుకొని అతనిసేవచేస్తూ మీరు ధన్యులయారు. నాగర్వం, తామసం, అహంభావం, అన్నీ వాసు తపోగ్నిలో భస్మమయాయి. తులసివనంలో గంజాయిమొక్క అనుకొని నన్ను మీకుటుం

బంలో ఉండనీయండి.

రామం : అన్నయ్యగారు క్షమించడమే మీకువరం.

వసంత : (వాసువైపు ప్రార్థనాపూర్వకంగా తిరుగుతుంది. వాసు జేబులోనుండి కొయ్యమన్వేన పైకి తీస్తాడు. వసంత దానిని ఆతురితగా తీసుకొని కళ్ళకి అద్దుకొని నమస్కారం చేసి తలమువ్వుకొని)

గీ॥ బాహ్యవేషమే ఘనమని భ్రాంతిచెంది
ఆత్మసౌందర్యమెరుగని యట్టినాకు
అంఘ్రిమాత్మసేవాభాగ్య మమరజేయు
కొయ్యమన్వేన ! నతు లందుకొనగదమ్మ !

వాసు: వసంతా! నాజీవితం ధన్యమయింది. ఈపరివర్తనం నన్ను సంతుష్టిపరచడానికి కాదు. దేశానికి అమూల్యమయిన సేవచెయ్యడానికి ఈశ్వరుడు నీకీఆత్మశక్తి ప్రసాదించాడు. (తండ్రివద్దకు వసంతను తీసుకొనివెళ్లి) నాన్నగారూ ! డాక్టరు వసంతాబాయి.

లక్ష్మి : (పరకాయించి చూసి] కృష్ణారావుగారి కొమార్తా?

వసంత : నమస్కారం !

వాసు : ఈమెకుపూర్తిగా హృదయపరివర్తనం కలిగింది. నేటినుండి ఈమె మీకోడలు.

లక్ష్మి : దీర్ఘసుమంగలీభవ! అమ్మా ! నాకు చాలాచాకిరీ చేశావు. ఇంకంతా మావాడిఇష్టమే ! మీరిద్దరూ నన్నిలా టప్పుడు కనిపెట్టి ఉంటే అంతేచాలు. (జానకి రామం పూల హారాలు అందియ్యగా వసంత, వాసు, ఒకరి మెడలో ఒకరు వేసుకుంటారు.) చూడూ ! ఆరామానికి కూడా ఎవరినో చూసి ముడిపెట్టే ! పాపం ! చిన్నప్పటినుంచీ కనిపెట్టుకొని ఉన్నాడు.

వాసు : జానకీదేవికీ రామానికీ ఇష్టమయితే సంబంధం

సిద్ధంగా నేఉంది. ఏమమ్మా జానకీదేవి? (జానకి సిగ్గుతో తలవంచు కొంటుంది.] ఏమిరామం?

రామం : మీఅభీష్టమేకాని నాకు వేరే అభిప్రాయం లేదు.

[రామం జానకి లక్ష్మీపతికి నమస్కరిస్తారు. వాసు వసంత పూలహారా లందియ్యాగా రామం జానికి ఒకరిమెడలో ఒకరు వేసుకుంటారు.

లక్ష్మి : [దీవిస్తూ] శుభం! మావాడిని విడిచిపెట్టకేం! నా అన్న వాళ్ళింకెవ్వరూ లేరు.

[కృష్ణారావుప్రవేశం. వసంతతొందరగావెళ్ళి చెయ్యిపట్టుకొనితీసుకొనివస్తూ]

వసం : రండి! రండి! వాసు నన్ను క్షమించాడు. అనుగ్రహించాడు. అతన్ని క్షమాపణ కోరుకొండి.

కృష్ణా : వాసూ! వయస్సులో చిన్నవాడివయినా బుద్ధి వికాసంలోనూ గుణాలలోనూ నాకన్న నువ్వు ఎన్నోరెట్లు పెద్ద! నిజంగా నీయెదుట నిలబడడానికీ, నిన్ను కన్నెత్తిచూడడానికీ నాకు అర్హతలేదు. మీరామం నన్ను అన్నమాటలు పరమసత్యాలు. నాదుశ్చరిత్ర నాకు తెలుసును. దేవాలయంలోకి పరమపాపీ వెళతాడు, మహాభక్తుడూ వెళతాడు. కాంగ్రెసుసంస్థ అతిపవిత్రమైనది గనుకనే ఇన్నాళ్లూ నన్ను భరించింది. ఇప్పుడు నీచరిత్ర, మహత్తు, నాకు జ్ఞానమార్గం చూపించాయి. దేశాన్ని నిద్రలోనుంచి మేలుకొలిపే వైతాళికులు మీరంతా! నిన్నుచూసి సిగ్గుతో, పశ్చాత్తాపంతో కుంగిపోతున్నాను.

వాసు : మీది చాలా ఒడిదుడుకుల జీవితమైపోయింది. మాభాగ్యవరంలో వయోజనపాఠశాల ఉంది. ఇక్కడరైతులకి కాస్త చదువు చెపుతూంటే మీకువిశ్రాంతి, కాలక్షేపం.

కృష్ణా : వద్దు! నేనుతగను; నామనస్సులో ఎంతపరివర్తనం కలిగినా, నువ్వెంత మనస్ఫూర్తిగా నన్ను క్షమించినా, లోకం మాత్రం నన్ను క్షమించదు. 'వృద్ధానారీపతివ్రతా'అని లోకం సులభంగా అనేస్తుంది. ఈక్షుద్రజీవి ఇక్కడుంటే నీఉద్యమానికి కూడా కళంకమే! నేనేదో యాత్రలు చేసుకుంటూ దేశాలంటపోతాను. అజ్ఞాతంగా ప్రపంచనాటకరంగంలోనుంచి విరమిస్తాను. మాఅమ్మాయిని అనుగ్రహించావు. చాలు. [గద్గదికతో] నీకొక్క నమస్కారం చెయ్యనియ్యవూ! హృదయపూర్వకంగా!...............

వాసు : శాంతించండి! శాంతించండి. మనమంతా కలిసి ఆంధ్రమాతను స్తవంచేదాం!

శా॥ "ఆచాళుక్యనృపాలరత్నముల వియ్యమ్మంది శ్రీకాకతి
క్ష్మాచక్రేశుల లాలనల్ వడసి కృష్ణప్రాజ్యసామ్రాజ్య పీ
ఠీచంచజ్జయకన్యతో సరసగోష్ఠిన్ ప్రొద్దువోబుచ్చు నీ
ప్రాచీనాభ్యుదయంబు నెన్నెదము గర్వస్ఫూర్తి; ఆంధ్రావనీ॥

[రాయప్రోలు]

[కర్మవీరుడు ప్రవేశం; అందరూ నమస్కరిస్తారు.]

అందరూ : జే! ఆంధ్రమాతకు జే!

కర్మ : ఆనందం! పరమానందం! నాహృదయాకాశంలో అమావాశ్య చీకట్లుతొలగి నేడు చిన్న ఆశాచంద్రకాంతి గోచరించినది.

సీ॥ తనగీతి అరవజాతిని పాటకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి,
తనపోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుగుకత్తి

సన నేప్ప నలరిన తెనుగురేఖ
తనవేణికలు వసుంధరను సస్యశ్యామ
లను చేయజెలగిన తెనుగుభూమి

అస్మదార్ద్రమనోవీధి నావహింప
జ్ఞప్తివచ్చె. నేడిగిచూడ; చావలేదు,
చావలేదాంధ్రులమహోజ్వలచరిత్ర;
హృదయములు చీల్చి చూడుడో సదయులార॥ [నాయకులు]

ఏడీ! నావాసు ?

[వాసు సమీపించి నమస్కరిస్తాడు]

కర్మ : నాయనా! ఆంధ్ర దేశాన్ని ఆవరించిన దాస్యతిమిరాలను తొలగించే ఆంధ్రజ్యోతిని వెలిగించావు. ఈజ్యోతి స్వతంత్రకాంతులు ప్రసరింపచేస్తూ గ్రామగ్రామానికీ వ్యాపించి ప్రజ్వరిల్లాలి. ప్రతిగ్రామానికీ ఒక్కొక్క వాసు ఉదయిస్తే ఆంధ్రరాష్ట్రమే కాదు, భారత దేశానికి స్వరాజ్యం కూడా అచిరకాలంలో ప్రాప్తిస్తుంది. ఏదీజ్యోతి ?

హారతి [కర్పూరహారతి వెలిగిస్తారు.]

౧౦ —♦ భరతవాక్యం ♦—

తెలుగు నేలలో నీదాస్యతిమిరమింక
నిలువజాలదాంధ్రజ్యోతి వెలుగుచుండ
[illegible] షల్లెల నీస్వతంత్రాంధ్రమాత
కాలయంబులు వెలయుగాక! ఆంధ్రరాష్ట్ర
మచిరకా[illegible]న్ ప్రాప్తి[illegible]గును గాక ॥

సమాప్తము.